య్యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో భూయిష్ఠాన్తే నమఉక్తిం విధేమ॥ ౫.౩౯॥

అగ్నే, నయ, సుపథేతి సు+పథా, రాయే, అస్మాన్, విశ్వాని, దేవ, వయునాని, విద్వాన్, యుయోధి, అస్మత్, జుహురాణమ్, ఏనః, భూయిష్ఠామ్, తే, నమ ఉక్తిమితి నమః+ఉక్తిమ్, విధేమ.

పదార్థః:-(అగ్నే)సర్వనేతః పరమాత్మన్ (నయ)ప్రాపయ(సుపథా)యథా సుకృతః శోభనేన ధర్మమార్గేణ గచ్ఛన్తి తథా.(రాయే)పరమ శ్రీమోక్ష సుఖప్రాప్తయే (అస్మాన్) అభ్యుదయ నిఃశ్రేయస సుఖస్పృహావతః(విశ్వాని)సర్వాణి.(దేవ)సర్వానన్దప్రాపక! సర్వజగత్ప్రకాశక(వయునాని)ప్రశస్తాని కర్మాణి ప్రజాశ్చ. వయునమితి ప్రశస్యనామసు పఠితమ్. నిఘం.౩.౮. వయునం వేతేః కాన్తిర్వా ప్రజ్ఞా వా. నిరు. ౫,౧౪. వయునాని విద్వాన్ ప్రజ్ఞానాని ప్రజానన్. నిరు. ౮, ౨౦.(విద్వాన్) యః సర్వం వేత్తి సః.(యుయోధి)దూరీ కురు. అత్ర బహులం ఛన్దసీతి శపః శ్లుః,(అస్మత్)అస్మాకం సకాశాత్(జుహురాణమ్)కుటిలమ్,(ఏనః)దుఃఖఫలం పాపం.(భూయిష్ఠామ్)బహుతమామ్.(తే) తవ.(నమ ఉక్తిమ్)యథా నమోభి రుక్తిం విదధతి తథా, (విధేమ)వదేమ, అయం మన్త్రః.శత. ౩. ౫. ౨. ౧౧. వ్యాఖ్యాతః,

అన్వయః :- హే అగ్నే! దేవ! జగదీశ్వర! విద్వాంస్త్వం యథా సుకృతో రాయే సుపథా విశ్వాని వయునాని ప్రాప్నువన్తి, తథాస్మాన్నయ జుహురాణ మేనోఽస్మద్యుయోధి. వయం తే తవ భూయిష్ఠాం నమ ఉక్తిం విధేమ.

భావార్థః :- అత్రోపమాలఙ్కారః. యథా ప్రేమ్ణోపాసితః సన్ జగదీశ్వరో జీవాన్ దుష్టమార్గాద్వియోజ్య ధర్మమార్గే స్థాపయిత్వైహిక పారమార్థిక సుఖాని తత్తత్కర్మానుసారేణ దదాతి,తథా న్యాయాధీశైరపి విధేయమ్.

పదార్థము:-(అగ్నే)సకల జనులను శ్రేష్ఠమార్గమున నడపించువాడా!(దేవ)సకలానందములనిచ్చువాడా! (విద్వాన్) సమస్త విద్యాన్వితుడవగు నోజగదీశ్వరా! (రాయే) మోక్షము అను ఉత్తమధనమునకై (సుపథా)ధార్మికజనులెటులను త్తమమార్గముద్వారా (విశ్వాని వయునాని)సమస్త ఉత్తమ కర్మలను, విజ్ఞానమును, ప్రజ్ఞను పొందుచున్నారో అటులనే నీవుదయతో(అస్మాన్)మాకు(నయ)లభింపజేయుము.మఱియు(జుహురాణమ్) కుటిలమును(ఏనః)దుఃఖఫలరూపమును నగు పాపమును(అస్మత్)మానుండి(యుయోధి) దూరమొనర్చుము. మేము(తే)నీకు(భూయిష్ఠాం)అత్యధికముగ(నమ ఉక్తిమ్)నమస్కార రూపవాణిని(విధేమ)విన్నవించుచున్నాము.

భావార్థము:- ఇట నుపమాలంకారమున్నది. ఎటుల సత్యప్రేమచే నుపాసించబడిన పరమేశ్వరుడు జీవులను దుష్టమార్గముల నుండి వేరుపఱచి ధర్మమార్గమవలంబింపజేసి ఐహిక[పారలౌకిక]సుఖములను వారివారి కర్మలననుసరించి ప్రసాదించునో, అటులనే న్యాయమొనర్చువారును ఒనర్చవలయును. [౨౦౧]

౨౦౨. అయన్న ఇత్యస్యాగస్త్య ఋషిః, అగ్ని ర్దేవతా అర్షీ త్రిష్టుప్, ఛన్దః, ధైవతః స్వరః.
పునః శూరగుణా ఉపదిశ్యన్తే.

మరల నీశ్వరోపాసనచేయు శూరవీరుని గుణములీ మంత్రమం దుపదేశింప బడుచున్నవి.

అయన్నో అగ్ని ర్వరివస్కృణో త్వయం మృధః పురఽఏతు ప్రభిన్దన్।
అయం వాజాఞ్జయత్తు వాజసాతా వయఀశత్రూఀ ఞ్జయతు జర్హృషాణః స్వాహా॥

అయమ్, నః, అగ్నిః, వరివః, కృణోతు, అయమ్, మృధః, పురః,ఏతు, ప్రభిన్దన్నితి ప్ర+భిన్దన్, అయమ్, వాజాన్ జయతు, వాజసాతావితి వాజ+సాతౌ, అయమ్, శత్రూన్, జయతు, జర్హృషాణః, స్వాహా. ॥౫.౩౭॥

పదార్థః:-(అయమ్)పరమేశ్వరోపాసకో జనః.(నః)అస్మాకం ప్రజాస్థానాం జీవానాం(అగ్నిః) స్వయంప్రకాశమానోఽగ్ని రివ పాపినాం దగ్ధా.(వరివః)భృశం రక్షణం(కృణోతు)కరోతు(అయం) యుద్ధకుశలః(మృధః)కుత్సితాన్.(పురః)పురస్తాత్.(ఏతు)గచ్ఛతు,(ప్రభిన్దన్)యథా శత్రుదలం విదారయం స్తథా,(అయం)వీరాణాం ప్రహర్షకః. (వాజాన్) సంగ్రామాన్.(వాజసాతౌ) యథా సంగ్రామే తథా (అయం) విజయప్రాపకః, (శత్రూన్) అరీన్, (జయతు) (జర్హృషాణః)అతిశయేన హృష్టః (స్వాహా)శోభనాం వాచం వదన్, అయం మన్త్రః. శత. ౩. ౫౧.౧౨. వ్యాఖ్యాతః.

అన్వయః :- అయమగ్నిః, పరమేశ్వరోపాసకో జనో నో వరివః కృణోతు. యథా కశ్చిద్వీరః వాజసాతౌ మృధః శత్రూన్ పుర ఏతి,తథాఽయం,యథా చ కశ్చిద్వీరో మృధః శత్రూన్ ప్రభిన్దన్ వాజాన్ జయతి, పుర ఏతు, తథాఽయం జర్హృషాణః స్వాహా శోభనాం వాచం వదన్ జయతు.

భావార్థః :- యే పరేశోపాసనాం న విదధతే, నైవ తేషాం సర్వత్ర విజయో జాయతే. యే సుశిక్షితాన్ వీరాన్ సత్కృత్య సేనాం న రక్షన్తి, తేషాం సర్వత్ర పరాజయో భవతి, తస్మాదేతద్వయం మనుష్యైః సదాఽనుష్ఠేయమితి.

పదార్థము :-(అగ్నిః)పరమేశ్వరోపాసకుడైన[అయం]యీ జనుడు(నః)ప్రజాస్థజీవములగు మమ్ము (వరివః కృణోతు) నిరంతరము రక్షించుగాక! ఎటుల వీరపురుషుడు స్వసేనను తీసుకొనివెళ్లి సంగ్రామమందు నిందితులును దుష్టులును నగువైరులను ముందుగనే ముట్టడించునో అటులనే(అయం)యుద్ధకుశలుఁడగు నీ సేనాధిపతి(వాజసాతౌ) సంగరములందు దుష్టశత్రువులను(పురః)ముందుగనే (ఏతు) దాడిజరిపి ముట్టడించునుగాక! మఱియు నెటుల(అయం)వీరులకు హర్షముగొలుపు నీ సేనాని దుష్టశత్రువులను(ప్రభిందన్)ఛిన్నభిన్న మొనర్చుచు(వాజాన్) యుద్ధములను (జయతు) జయించునో [అటులనే] (అయం)విజయముకలిగించు నీ సేనాపతి(జర్హృషాణః)నిరంతరము ప్రసన్నుడై(స్వాహా) సామరికశ్రేష్ఠధ్వని సంజ్ఞల నుచ్చరించుచు(జయతు)బాగుగా జయమును పొందుగాక!

భావార్థము :- పరమాత్మను నుపాసించని వారికి సర్వత్ర జయము లభించదు. సుశిక్షనొసగి శూరవీరపురుషులను సత్కరించి సేన నుంచని వారికి సర్వత్ర అపజయము

సహాజముగ సంభవించును. కావున ఒకటి పరమేశ్వరోపాసన, రెండు సదావీరుల రక్షణ. ఈ రెండుప్రబంధములను మానవులు సంతతమనుష్ఠించ వలయును. [౨౦౨]

౨౦౩. ఉరు విష్ణ విత్యస్యాగ స్త్య ఋషిః, విష్ణు ర్దేవతా, భురిగార్ష్యనుష్టుప్ ఛన్దః. గాన్ధారః స్వరః.
పున స్తా కీదృశా విత్యుపదిశ్యతే.

మరల వారెటులున్నారను విషయ మీ మంత్ర ముందుపదేశించ బడుచున్నది.

ఉరు విష్ణో వి క్రమస్వోరు క్షయాయ నస్కృధి। ఘృతం ఘృతయోనే పిబ ప్రప్ర యజ్ఞపతి న్తిర స్వాహా॥ ॥౫.౩౮॥

ఉరు, విష్ణో+ఇతి విష్ణో, వి, క్రమస్వ, ఉరు,క్షయాయ,నః,కృధి,ఘృతమ్, ఘృతయోనే+ఇతి ఘృత+యోనే. పిబ, ప్రప్రేతి ప్ర+ప్ర. యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, తిర, స్వాహా.

పదార్థః :-(ఉరు)బహు.(విష్ణో)యథా సర్వవ్యాపకేశ్వరః సర్వం జగన్నిర్మాతుం తథా(విక్రమస్వ)గచ్ఛ(ఉరు)బహు.(క్షయాయ)నివాసార్థాయ గృహాయ విజ్ఞానాది ప్రాప్తయే వా.(నః)అస్మాన్ (కృధి)కురు.(ఘృతమ్)ఆజ్యమ్.(ఘృతయోనే) యథా ఘృతయోని రగ్ని స్తథా తత్సంబుద్ధౌ (పిబ) (ప్రప్ర)ప్రకృష్టార్థే (యజ్ఞపతిం)యథా హోత్రాదయో యజ్ఞపతిం రక్షన్తో యత న్తే తథా.(తిర)ప్లవస్వ (స్వాహా)యజ్ఞక్రియాయాః. అయం మన్త్రః. శత. ౩.౫.౨.౧౫. వ్యాఖ్యాతః.

అన్వయః :- యథా విష్ణు ర్విక్రమతే తథోరు విక్రమస్వ. నః క్షయాయ. ఉరు కృధి. హే ఘృతయోనే! యథాఽగ్ని రాజ్యం పిబతి తథా త్వం ఘృతం ప్రప్ర పిబ. యథా చ ఋత్విగాదయో యజ్ఞపతిం సంరక్ష్య దుఃఖం తర న్తి తథా త్వం స్వాహా వాచం వదన్ సన్ విజయేన యజ్ఞేన యజ్ఞం ప్రప్ర తిర.

భావార్థః :- అత్రోపమాలంకారః, యథా పరమేశ్వరో వ్యాపకత్వా త్సర్వం జగద్రచితుం రక్షితుం సమర్థః సర్వాన్ సుఖయతి, తథాఽనన్దయితవ్యమ్. యథా చాగ్ని రిన్ధనాని ప్రదహతి, తథా శత్రవః ప్రదగ్ధవ్యాః. యథా హోత్రాదయో ధార్మికం యజ్ఞపతిం ప్రాప్య స్వకార్యాణి సాధ్నువన్తి, తథా ప్రజాస్థాః పురుషా ధర్మాత్మానం సభాపతిం పాప్య సుఖాని సాధ్నువన్తు.

పదార్థము :- ఎటుల సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు సకలజగత్తును రచించువాడై జగత్కారణమును పొంది సర్వమును రచించుచున్నాడో అటులనే విద్యాది గుణములందు వ్యాప్తుడవగునో వీరపురుషా! స్వ విద్యాఫలమును(ఉరు)ఎక్కువ(వి) బాగుగా (క్రమస్వ)అందు కొనుము (క్షయాయ)నివాసమొనర్చుటకు యోగ్యమైన గృహమును, మఱియు విజ్ఞానమును పొందుటకు యోగ్యులుగా(నః)మమ్ము(కృధి)ఒనర్పుము.(ఘృతయోనే)ఓ విద్యాది సుశిక్షాయుక్తుడవైన పురుషుడా!ఎటులగ్ని ఘృతమును పానమొనర్చి ప్రదీప్తమగుచున్నదో అటులనే నీవును స్వగుణములందు(ఘృతం)ఘృతమును (ప్రప్ర పిబ)

మాటిమాటికి సేవించి శరీరబలాదులతో ప్రకాశించుము. ఋత్విగాది విద్వాంసు లెటుల (యజ్ఞపతి)యజమానుని రక్షించుచు యజ్ఞమును పారమొనరింపజేయుచున్నారో[దుఃఖములనుండి తరింపజేయుచున్నారో]అటులనే నీవును (స్వాహా)యజ్ఞక్రియచే(యజ్ఞమ్) యజ్ఞమును (తిర) పార మొనర్చుము.

భావార్థము :- [ఇందు ఉపమాలంకారమున్నది.] ఎట్లు పరమేశ్వరుడు స్వవ్యాపకత్వముచే కారణమును పొంది సర్వజగత్తును రచించి పాలించుచు సకలజీవులకు సుఖము చేకూర్చుచున్నాడో అటులనే మనమందఱమానందించుట యుచితము. ఎటుల అగ్ని కాష్ఠాది ఇంధనములను, ఘృతాది పదార్థములను పొంది ప్రకాశవంతమగుచున్నదో,అటులనే మనమును శత్రువులను జయించి ప్రకాశితులము కావలయును. ఎటుల హోత్రాది విద్వాంసులు ధార్మికయజ్ఞమొనర్చు యజమానునిపొంది స్వకార్యములను సాధించుచున్నారో,అటులనే ప్రజాస్థులగు జనులు ధర్మాత్ముడగు సభాపతిని పొంది స్వ సుఖములను సాధించుకొనవలయును. [౨౦౩]

---

౨౦౪. దేవసవితరిత్యస్యాగస్త్య ఋషిః, సోమసవితారౌ దేవతే, ఆద్యస్య సామ్నీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః, ఏత త్వమిత్యుత్తరస్యార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పున స్తౌ కీదృశా విత్యుపదిశ్యతే.

మరల వారెటులున్నారను విషయ మీ మంత్ర మందుపదేశించబడినది.

దేవ సవిత రేష తే సోమ స్తఀ రక్షస్వ మా త్వా దభన్। ఏత త్త్వం దేవ సోమ దేవో దేవాఀ౨॥ ఉపాగా ఇదమహ మ్మనుష్యా న్త్సహ రాయస్పోషేణ స్వాహా నిర్వరుణస్య, పాశాన్ముచ్యే॥ ॥౫.౩౯॥

దేవ సవితః, ఏషః, తే, సోమః, తమ్, రక్షస్వ, మా, త్వా, దభన్, ఏతత్, త్వమ్, దేవ, సోమ, దేవః, దేవాన్, ఉప, అగాః, ఇదమ్, అహమ్, మనుష్యాన్, సహ, రాయః, పోషేణ, స్వాహా, నిః, వరుణస్య, పాశాన్ ముచ్యే.

పదార్థః:-(దేవ)సకలవిద్యాద్యోతక!(సవితః)ఐశ్వర్యవన్!(ఏషః)ప్రత్యక్షః.(తే)తవ(సోమః) ఐశ్వర్యసమూహః.(తం)(రక్షస్వ)అత్ర వ్యత్యయే నాత్మనేపదమ్.(మా)నిషేధే(త్వా)త్వాం(దభన్) హింస్యుః. అత్ర లిఙర్థే లఙడభావశ్చ.(ఏతత్)ఏతస్మాత్(త్వమ్)సభాధ్యక్షో రాజా(దేవ) సుఖప్రద (సోమ)సన్మార్గే ప్రేరక!(దేవః)విద్యాప్రకాశస్థః,(దేవాన్)దివ్యాన్ విదుషః,(ఉప)సామీప్యే (అగాః) గచ్ఛ(ఇదమ్)త్వదనుష్ఠితం అహం(మనుష్యాన్)మననశీలాన్.(సహ రాయః)ధనసముదాయస్య(పోషేణ)పుష్ట్యా(స్వాహా)సత్యాం వాచం వదన్ సన్,(నిః)నితరామ్, (వరుణస్య) దుఃఖే నాచ్ఛాదకస్య తిరస్కర్తుః. (పాశాత్)బన్ధనాత్,(ముచ్యే)ముక్తోభవామి. అయం మన్త్రః. శత. ౩.౫.౨. ౧౮-౨౦ వ్యాఖ్యాతః.

అన్వయః :- హే దేవ సవితః సభాధ్యక్ష! యథాఽహం భవత్సహాయేన స్వకీయ మైశ్వర్యం రక్షామి. తథా త్వం య ఏష తే సోమోఽస్తి తం రక్షస్వ. యథా మాం శత్రవో న హింసన్తి తథా త్వా త్వామస్మత్సహాయేన మా దభన్. హే దేవ సోమ! దేవస్త్వం యథై తదేతస్మాద్దేవానుపాగా స్తథాఽహమప్యుపాగామ్, యథాఽహ మిదమనుష్ఠాయ రాయస్పోషేణ సహ వర్తమానో మను ష్యాన్ దేవాంశ్చైత్య వరుణస్య పాశన్నిర్ముచ్యే, తథా త్వమపి నిర్ముచ్యస్వ.

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. సర్వేషాం మనుష్యాణా మియం యోగ్యతాస్తి, యదప్రాప్తస్యైశ్వర్యస్య పురుషార్థేన ప్రాప్తి, తద్రక్షోన్నతీః కృత్వా ధార్మికాన్ మనుష్యాన్ సంగత్యై తేన సత్కృత్య చ ధర్మమనుష్ఠాయ విజ్ఞానమున్నీయ దుఃఖబన్ధనాన్ముక్తా భవన్తు.

పదార్థము :-(దేవ) [సవితః]సకల విద్యల ప్రకాశపఱచు నైశ్వర్యశాలివైన నో విద్వాంసుడా! సభాధ్యక్షా! నేనెటుల నీసహాయమువలన స్వీయైశ్వర్యమును రక్షించు [దాచిఉంచు]కొనుచున్నానో అటులనే(ఏషః తే సోమః)ఏయీ నీఐశ్వర్యసమూహము న్నదో(తం రక్షస్వ)దానిని నీవు ఉంచుము.శత్రుజనులెటుల నన్ను బాధింపజాలరో అటు లనే(త్వాం)నిన్నును[మాసహాయమున](మాదభన్) కష్టపెట్టజాలకుందురుగాక! (దేవ) సుఖప్రదాతా!(సోమ)సజ్జనమార్గమున నడపించు ప్రభువా!(త్వం)నీవు(ఏతత్)ఇందులకై సభాధ్యక్షుడవును(దేవః)పరిపూర్ణ విద్యాప్రకాశస్థుడవునునై [ఎటుల] (దేవాన్) శ్రేష్ఠ విద్వాంసుల(ఉప)సమీపమునకు (ఆగాః) వెళ్ళుదువో, అటులనే నేనును చేరెదను గాక! నేనెటుల(ఇదం)ఈ ఆచరణమొనర్చి (రాయః పోషేణ) అత్యంత ధన,పుష్టి యుక్తుడనై (మనుష్యాన్)విచారవంతులగు పురుషులను (దేవాన్) విద్వాంసులను పొంది (వరుణస్య). దుర్ధర్ముడగు దుష్టజనుని (పాశాత్) బంధనములనుండి (ముచ్యే) విముక్తుడనగుదునో అటులనే నీవును(నిః)నిరంతరము ముక్తుడవు కమ్ము.

భావార్థము :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. పురుషా ర్థములచే లభించిన అప్రాప్త ఐశ్వర్యమును రక్షించియు, వృద్ధిపఱచియు,ధార్మిక జనుల స్నేహమొనర్చియు, సత్కరించియు, ధర్మానుష్ఠాన మొనర్చియు విజ్ఞానమునభివృద్ధిపఱ చియు దుఃఖబంధనములనుండి విముక్తినొందుట మానవులందఱకు యోగ్యము [౨౦౪]

౨౦౫. అగ్నే వ్రతపా ఇత్యస్యాగస్త్య ఋషిః, అగ్నిర్దేవతా. నిచృద్బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తౌ కథం వర్తేయాతా మిత్యుపదిశ్యతే.

మరల వారెట్లు ప్రవర్తించుచున్నారను విషయ మీ మంత్ర మందుపదేశించ బడినది.

అగ్నే వ్రతపాస్తే వ్రతపా యా తవ తనూ ర్మయ్యభూదేషా సా త్వయి యో మమ తనూస్త్వయ్యభూ దియꣳ సా మయి। యథాయథన్నో వ్రతపతే వ్రతాన్యను మే దీక్షాన్దీక్షాపతి రమꣳస్తాను తప స్తపస్పతిః॥ ॥౫.౪౦॥

అగ్నే, వ్రతపాఇతి వ్రత+పాః, తే, వ్రతపాఇతి వ్రత+పాః, యా, తవ, తనూః, మయి, అభూత్, ఏషా, సా, త్వయి, యో+ఇతి యో, మమ, తనూః, త్వయి, అభూత్, ఇయమ్, సా, మయి, యథాయథమితి యథా+యథమ్, నౌ, వ్రతపతే+ఇతి వ్రత+పతే, వ్రతాని, అను, మే, దీక్షామ్, దీక్షాపతిరితి దీక్షా+పతిః, అమం_స్త, అను, తపః, తపస్పతి రితి తపః+పతిః.

పదార్థః :-(అగ్నే)విజ్ఞానోన్నత.(వ్రతపాః)యథా సత్యపాలకో విద్వాం_స్తథా తత్సమ్బుద్ధౌ (తే)తవ. (వ్రతపాః) పూర్వవత్, (యా, తవ, తనూః) వ్యాప్తినిమిత్తం శరీరం(మయి)త్వత్సఖే. (అభూత్)భవతు(ఏషా)సమక్షే వర్తమానా, (సా, త్వయి)మన్మిత్రే(యో)యా(మమ)(తనూః)విద్యా విస్తృతిః(త్వయి)మదధ్యాపకే(అభూత్)భవతి,(ఇయం)గోచరా.(సా,మయి)త్వచ్ఛిష్యే (యథాయథం)యథార్థం.(నౌ)ఆవాం(వ్రతపతే)యథా సత్యానాం రక్షక స్తథా తత్సమ్బుద్ధౌ(వ్రతాని) నియతాని సత్యాచరణాని(అను)పశ్చాదర్థే(మే) మమ.(దీక్షాం)వ్రతాదేశం (దీక్షాపతిః) యథా వ్రతాదేశపాలకః. (అమం_స్త)మన్యతే తథా పశ్చాద్యోగే(తపః)ప్రాక్క్లేశ ముత్తరానన్దం బ్రహ్మచర్యం, (తపస్పతిః) యథా బ్రహ్మచర్యాది పాలకః, అయం మన్త్రః, శత. ౩.౫.౨.౨౧. వ్యాఖ్యాతః.

అన్వయః :- వ్రతపాః అగ్నే! విద్వం_స్త్వం యథా మే వ్రతపా అభూత్,యథా తేఽహం వ్రతపాః భవేయమ్, యా తవ తనూః సా మయి భవతు. యైషా త్వయి మతి రస్తి,సా మయి స్యాత్. యో యా మమ తనూః సా త్వయి భవతు. హే వ్రతపతే! యథాఽయం జనో వ్రతపతి ర్భవతి తథా త్వం చాహం చ నౌ సఖాయౌ భూత్వా యథాయథం వ్రతాని సత్యాచరణాన్యనుచరేవ. హే మిత్ర! యథా తవ దీక్షాపతి స్తుభ్యం దీక్షా మమంస్త, తథా మే మమ దీక్షా మన్వమం_స్త! యథా తే తవ తపస్పతి స్త్వదర్థం తపోఽన్వమం_స్త తథా మే మమాపి తపస్పతి ర్మదర్థం తపోఽమం_స్త.

భావార్థః :- యథా పూర్వం విద్వత్కారిణోఽధ్యాపకా అభూవన్, తథాఽస్మదాదిభి రపి భవితవ్యమ్. యావన్మనుష్యా సుఖదుఃఖహానిలాభవ్యవస్థాయాం పరస్పరం స్వాత్మవన్న వర్తన్తే,న తావత్పూర్ణం సుఖం లభన్తే తస్మాదేతత్సర్వం మనుష్యైః కుతో నానుష్ఠేయమితి.

పదార్థము :- (వ్రతపాః) సత్యమును పాలించు విద్వాంసుడా! (అగ్నే) విశేష జ్ఞానశాలియగు నోపురుషుడా! ఎటుల నీవు నాకు (వ్రతపా అభూత్) సత్య విద్యాదిగుణముల పాలించు ఆచార్యుడవై యున్నావో అటులనే నేనును (తే) నీయొక్క [వ్రతపుడను]అగుదును.(తవ)నీయొక్క(యా తనూః) విద్యాది గుణములందు వ్యాప్తమగు నేదేహమున్నదో(సా) అది(మయి) నీమిత్రుడనగు నాలోకూడ నుండును గాక! (ఏషా) (త్వయి)నా మిత్రుడవగు నీయందు[నేయీామతి యున్నదో,(సా మయి)అది నాయందును ఉండునుగాక!]అభివృద్ధిచెందునుగాక!(యా)(మమ)(తనూః)నాయొక్కఏ విద్యావ్యాప్తి యున్నదో(సా)అది(త్వయి)నన్ను చదివించు నీయందును[అభూత్]కలుగుగాక!(ఇయం) ఇది(మయి)నీ శిష్యుడైన నాయందభివృద్ధిచెందునుగాక! (వ్రతపతే) సత్యాచరణములను

పాలించువాడా. ఎటుల ఇతను సత్యగుణాన్వితుడు, సత్యోపదేశకుడు, రక్షకుడునగు విద్వాంసుడు [గను]న్నాడో అటులనే నీవును, నేనును మిత్రులమై (యథా యథం) యథా యుక్తముగ (వ్రతాని) సత్యాచరణములను పాలించుదుముగాక! ఓమిత్రమా! ఎటుల (తవ) నీయొక్క (దీక్షాపతిః) యథోక్తోపదేశమొనర్చువాడు నీకొరకు (దీక్షాం) సత్యోపదేశమును (అమంస్త) గఅపుడ యెరుగుచున్నాడో అటులనే (మే) నాకొరకును (అను) ఎరుగును గాక! ఎటుల నీయొక్క (తపస్పతిః) అఖండబ్రహ్మచర్యమును పాలించు నాచార్యుడు నీకై (తపః) మొదటకష్టమును తర్వాత సుఖమును సమకూర్చుబ్రహ్మచర్యపాలనమును ఎఱుగుచున్నాడో అటులనే నాయొక్క అఖండబ్రహ్మచర్యమును పాలించు[ఆచార్యు]డును నాకొరకు నెరుగుచు గాక!

భావార్థము:- ప్రాచీనకాలమున విద్యాధ్యాపకులెటులుండియున్నారో, అటులనే మనమును ఉండవలయును. సుఖదుఃఖములందును, హాని లాభములందును పరస్పరము స్వాత్మతుల్యాను గ ఒకరినొకరు భావించనంతవరకు పూర్తిసుఖను లభించజాలదు; కావున మానవులు శ్రేష్ఠవ్యవహారములనే ఆచరించు చుండవలయును. [२०४]

२०८. ఉరువిష్ణ విత్యస్యాగస్త్య ఋషిః, విష్ణుర్దేవతా, భురిగార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తౌ కథం వర్తేయాతా మిత్యుపదిశ్యతే.

మరల వారెట్లు ప్రవర్తించుచున్నారను విషయ మీ మంత్ర మందుపదేశించబడుచున్నది.

ఉరు విష్ణో విక్రమస్వోరు క్షయాయ నస్కృధి। ఘృతం ఘృతయోనే పిబ ప్రప్ర యజ్ఞపతి న్తిర స్వాహా॥ ॥५.४०॥

ఉరు, విష్ణో+ఇతి విష్ణో, వి, క్రమస్వ, ఉరు, క్షయాయ, నః, కృధి, ఘృతమ్, ఘృతయోనఇతి ఘృత+యోనే, పిబ, ప్రప్రేతిప్ర+ప్ర. యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, తిర, స్వాహా॥

పదార్థః :- (ఉరు) బహు (విష్ణో) యథా వ్యాపనశీలో వాయుర్విక్రమతే తథా తత్సంబుద్ధౌ. (విక్రమస్వ) పాదైః విద్యాఙ్గైః సంపద్యస్వ. (ఉరు) విస్తీర్ణే, (క్షయాయ) విజ్ఞానోన్నతయే (నః) అస్మాన్ (కృధి) కుర్యాః (ఘృతం) ఉదకం (ఘృతయోనే) యథా జలనిమిత్తా విద్యుద్వర్తతే, తథా తత్సంబుద్ధౌ (పిబ) (ప్రప్ర) ప్రకృష్టమివ. (యజ్ఞపతిం) యథాఽహం యజ్ఞపతిం తథా త్వం (తిర) దుఃఖం ప్లవస్వ, (స్వాహా) సుహుతం హవిః, అయం మంత్రః. శత. ३.५,३. २-३.

అన్వయః :- హే విష్ణో త్వం ఉరుక్షయాయ విక్రమస్వ నోఽస్మాన్ సుఖినః కృధి, హే ఘృతయోనేః యథా విద్యుత్ తథా ఘృతం పిబ. యథాఽహం యజ్ఞపతిం సంతరామి, తథా స్వాహాను తిష్ఠన్ ప్రప్ర తిర.

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః యథా పవనః సర్వాన్ సుఖయన్ సర్వాధిష్ఠానోఽస్తి, తథైవ విదుషా సంపత్తవ్యమ్.

పదార్థము :- సకల పదార్థములందు వ్యాప్తమగు పవనమెటుల వీచుచున్నదో అటులనే విద్యాగుణములందు వ్యాప్తమగునో విద్వాంసుడా!(ఉరు)అత్యంత విస్తారయుక్తముగ(క్షయాయ)విద్యో[జ్ఞానో]న్నతికొరకు(విక్రమస్వ)విద్యాయంగములచే పరిపూర్ణుడవు కమ్ము. మరియు(నః)మమ్ములను సుఖులుగా(కృధి)ఒనర్చుము.[ఘృతయోనే]జలమునకు విద్యుత్తు యెట్లు నిమిత్తకారణమై యున్నదో అటులనే పదార్థముల గ్రహించు నో విద్వాంసుడా! విద్యుత్తుల్యముగ(ఘృతం) జలమును (పిబ) త్రాగుము. మరియు ఎటుల నేను యజ్ఞపతిని తరింపచేయుచున్నానో అటులనే నీవును (స్వాహా) చక్కగా హవనాదికర్మలననుష్ఠించుచు దుఃఖక్లేశములనుండి దుఃఖమునుండి బాగుగా తరించుము.

భావార్థము:- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారమున్నది. పవనమెటుల అందరకు సుఖమును సమకూర్చుచు సర్వాధిష్ఠానమై యుండుచున్నదో అటులనే విద్వాంసుడును ఉండవలయును. [౨౦౬]

౨౦౭. అత్యన్యానిత్యస్యాగస్త్య ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడ్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః పూర్వోక్తాభ్యాం విరుద్ధా మనుష్యా న సేవనీయా ఇత్యుపదిశ్యతే,

మానవులు పూర్వోక్తవ్యవహారములకు విరుద్ధముగా నడచు మానవుని సేవించ కూడదను విషయ మీ మంత్ర మందుపదేశించబడుచున్నది.

అత్యన్యాఁ౨॥అగాన్నాన్యాఁ౨॥ఉపాగామర్వాక్త్వా పరేభ్యోఽవిదమ్పరోఽవరేభ్యః। తం త్వా జుషామహే దేవ వనస్పతే దేవయజ్యాయై దేవాస్త్వా దేవయజ్యాయై జుషన్తాం విష్ణవే త్వా। ఓషధే త్రాయస్వ స్వధితే మైనꣳ హిꣳసీః॥

అతి, అన్యాన్, అగామ్, న, అన్యాన్, ఉప, అగామ్, అర్వాక్, త్వా,పరేభ్యః, అవిదమ్, పరః. అవరేభ్యః, తమ్, త్వా, జుషామహే, దేవ, వనస్పతే,దేవయజ్యాయా+ఇతి దేవ+యజ్యాయై, దేవాః, త్వా, దేవయజ్యాయా+ఇతి దేవ+యజ్యాయై, జుషన్తామ్, విష్ణవే, త్వా, ఓషధే, త్రాయస్వ, స్వధితే, మా, ఏనమ్, హిꣳసీః. ॥౫.౪౨॥

పదార్థః:-(అతి)అత్యంతే(అన్యాన్)పూర్వోక్తభిన్నా నవిదుషః(అగామ్)ప్రాప్నుయామ్,(న) నిషేధే, (అన్యాన్) అవిదుషో విరుద్ధాన్ విదుషః,(ఉప)సామీప్యే(అగామ్)ప్రాప్నుయామ్(అర్వాక్)

అవరః,(త్వా)త్వాం,(పరేభ్యః)ఉత్తమేభ్యః, (అవిదమ్) లభేయ (పరః) ఉత్కృష్టః (అవరేభ్యః) ఉత్కృష్టేభ్యః (తం)(త్వా)త్వామ్,(జుషామహే)ప్రీణీయామ.(దేవ)కమనీయ(వనస్పతే) వనానాం రక్షక,(దేవయజ్యాయై)యథా దివ్యానాం సంగతయే తథా(దేవాః)విద్వాంసః(త్వా)త్వాం(దేవయజ్యాయై)యథోత్తమగుణదానాయ తథా(జుషన్తాం)సేవన్తాం(విష్ణవే)యజ్ఞాయ,(త్వా)త్వాం(ఓషధే)యథా సోమాద్యోషధిగణ స్త్రాయతే తథా(త్రాయస్వ)రక్ష,(స్వధితే)దుఃఖవిచ్ఛేదక(మా)నిషేధే,(ఏనం)ఓషధిగణం పరం పురుషం వా,(హింసీః)వినాశయేః. అయం మన్త్రః. శత. ౩.౫.౩,౫-౧౦.వ్యాఖ్యాతః.

అన్వయః:-హే వనస్పతే!దేవ;విద్వన్! యథా త్వమన్యానతీత్యాన్యానుపాగచ్ఛసి, తథాఽహమన్యాన్ నాగామన్యానుపాగామ్, యస్త్వం పరేభ్యః పరోఽస్యవరేభ్యోఽర్వాక్ చ తం త్వా మవిదం, యథా దేవా దేవయజ్యాయై త్వా త్వాం జుషంతే, తథా త్వా త్వాం వయం జుషామహే. యథా వయం దేవయజ్యాయై త్వాం జుషామహే, తథైతే సర్వే తం త్వాం జుషన్తామ్. యథౌషధిగణో విష్ణవే సంభూయ, సర్వాన్ త్రాయతే, తథా హే ఓషధే!సర్వరోగనివారక!స్వధితే!దుఃఖవిచ్ఛేదక! విద్వన్! త్వా త్వాం విష్ణవే యజ్ఞాయ వయం జుషామహే, హే దేవ!విద్వన్!యథాఽహ మిమం యజ్ఞం న హింసామి, తథైనం త్వమపి మా హింసీః.

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. మనుష్యై ర్నీచవ్యవహారాన్ నీచపురుషాంశ్చ త్యక్త్వోత్తమా వ్యవహారా ఉత్తమాః పురుషాశ్చ ప్రతిదిన మేషితవ్యాః.ఉత్తమేభ్య ఉత్తమశిక్షాఽవరేభ్యోఽవరా చ గ్రాహ్యా,యజ్ఞో యజ్ఞసామగ్రీ చ కదాచిన్న హింసనీయా సర్వైః పరస్పరం సుఖేన భవితవ్యమ్.

పదార్థము :-(వనస్పతే)సకల మూలికలను[రక్షిం]చువాడా!(దేవ)విద్వాంసుడవగు నోజనుడా! ఎటుల నీవు(అన్యాన్)విద్వాంసులకు విరోధులగు మూర్ఖజనమును[అతి] వదలి(అన్యాన్)మూర్ఖవిరోధులగు విద్వాంసుల సమీపమునకు చేరుచున్నావో,అటులనే నేనును విద్వద్విరోధులను పరిత్యజించి(ఉప అగామ్)[విద్వాంసుల] సమీపమున కేగుదును గాక!(పరేభ్యః పరం)ప నీవు ఉత్తమోత్తముడవును(అవరేభ్యః అర్వాక్)చిన్న వారికంటె చిన్న వాడవును[సూక్ష్మాతి సూక్ష్ముడవు]ను నై యున్నావో(తం త్వాం)అట్టి నిన్ను(అవిదం)పొందెదను గాక!ఎటుల(దేవాః)విద్వాంసులు (దేవయజ్యాయై) ఉత్తమ గుణముల నొసగుట[సంగతి]కై (త్వా) నిన్ను కోరుచున్నారో అటులనే మేమును(త్వా) నిన్ను (జుషామహే)అభిలషించెదము గాక! మరియు మేమెటుల(దేవయజ్యాయై)సద్గుణముల సంగతికై(త్వా)నిన్ను కోరుచున్నామో అటులనే వీరందరును[జుషంతామ్]కోరుదురు గాక! ఎటుల ఓషధుల సమూహము(విష్ణవే)యజ్ఞమునకై సిద్ధమై అందఱిని[త్రాయస్వ] రక్షించుచున్నదో, అటులనే రోగములను దూరమొనర్చువాడవును (స్వధితే) దుఃఖములను వినాశమొనర్చువాడవునునగు నోవిద్వజ్జనుడా!(త్వా) నిన్ను మేము యజ్ఞమునకై కోరుచున్నాము. శ్రేష్ఠవిద్వాంసుడవైన యో జనుడా! నేనెటుల యీ యజ్ఞమును వినాశ మొనరించగోరనో అటులనే నీవును (ఏనం)ఈ యజ్ఞమును (మా హింసీః)భగ్నమొనర్చకుము.

భావార్థము :- ఇందు వాచకలుప్తోపమాలంకారమున్నది. నీచవ్యవహారములను, నీచపురుషులను త్యజించి మంచిమంచి వ్యవహారములను, ఉత్తమ విద్వాంసులను నిత్యము అభిలషించవలయును మఱియు ఉత్తములనుండి ఉత్తమశిక్షను [అవరుల] న్యూనులనుండి న్యూనశిక్షను గ్రహించవలయును. యజ్ఞమును, యజ్ఞపదార్థముల నెన్నటికి తిరస్కరించ కూడదు. జనులందరు పరస్పర స్నేహముచే సుఖముగా నుండవలయును. [౨౦౭]

---

౨౦౮. ద్యామ్మా లేఖీరిత్యస్యాగస్త్య ఋషిః, యజ్ఞో దేవతా, బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
మనుష్యై ర్యజ్ఞార్థా విద్యా సర్వదా సంసేవనీయేత్యుపదిశ్యతే.

యజ్ఞమును సిద్ధపఱచు విద్యను మానవులు నిత్యము సేవించుట యోగ్యమను విషయ మీ మంత్ర మందుపదేశించబడినది.

ద్యామ్మా లేఖీ ర్‌న్తరిక్ష మ్మా హిꣳసీః పృథివ్యా సంభవ అయꣳహి త్వా స్వధితి స్తేతిజానః ప్రణినాయ మహతే సౌభగాయ। అత స్త్వన్దేవ వనస్పతే శత వల్శో విరోహ సహస్రవల్శా వి వయꣳరుహేమ॥ ॥౫.౪౩॥

ద్యామ్, మా, లేఖీః, అన్తరిక్షమ్, మా, హిꣳసీః, పృథివ్యా, సమ్, భవ, అయమ్, హి, త్వా, స్వధితిరితి స్వ+ధితిః, తేతిజానః, ప్రణినాయ, ప్రనినాయేతి ప్ర+నినాయ, మహతే, సౌభగాయ, అతః, త్వమ్, దేవ, వనస్పతే, శతవల్శ ఇతి శత+వల్శః, వి, రోహ, సహస్రవల్శాః, వి, వయమ్, రుహేమ.

పదార్థః :-(ద్యాం)సూర్యప్రకాశం(మా)నిషేధే(లేఖీః)లిఖేః (అన్తరిక్షమ్) అవకాశం,(మా) నిషేధే(హింసీః)హన్యాః.(పృథివ్యా)సహ.(సం) క్రియాయోగే(భవ),(అయం)వక్ష్యమాణః, (హి) యతః(త్వా)త్వాం(స్వధితిః) యథా వజ్ర స్తథా,(తేతిజానః)భృశం తీక్ష్ణః,(ప్రణినాయ) యథా త్వం ప్రణయే స్తథా(మహతే)విశిష్టాయ పూజ్యతమాయ,(సౌభగాయ)సుష్ఠుభగానా మైశ్వర్యాణాం భవాయ.(అతః)కారణాత్,(త్వం)(దేవ)ఆనన్దిత(వనస్పతే) వనానాం రక్షక. (శతవల్శః) యథా బహ్వఙ్కురో వృక్ష స్తథా(విరోహ)వివిధతయా ప్రాదుర్భవ.(సహస్రవల్శాః) యథా బహుమూలా వృక్షా రోహన్తి తథా(వి)వివిధతయా(రుహేమ)వర్ధేమహి. అయం మన్త్రః శత.౩.౫.౩.౧౩-౧౬.వ్యాఖ్యాతః.

అన్వయః:- హే విద్వన్! యథాఽహం ద్యాం న లిఖామి, తథా త్వమేనాం మా లేఖీః, యథాఽహమన్తరిక్షం న హింసామి తథా త్వమేత న్మా హింసీః. యథాఽహం పృథివ్యా సహ సంభవామి తథైతయా సహ త్వమపి సంభవ. హి యతః కారణాత్ యథా తేతిజానః స్వధితిః శత్రూన్ విచ్ఛిద్యైశ్వర్యం ప్రాపయతి, తథా త్వమపి ప్రాపయేః, అతో వయం త్వాం మహతే సౌభగాయ సంభావయేమ యథా కశ్చిదైశ్వర్యం ప్రణినాయ ప్రాపయతి, తథా వయం త్వాం ప్రాపయేమ, హే దేవ! వనస్పతే! పూర్వోక్తేన మహతా సౌభగేన యథా శతవల్శో వృక్షో విరోహతి తథా విరోహ, యథా సహస్రవల్శా వనస్పతయో విరోహన్తి తథా వయమపి విరోహేమ.

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః, ఇహ సంసారే కేనచిన్మనుష్యేణ విద్యాప్రకాశాభ్యాసః కదాచిన్నైవ త్యాజ్యః స్వాతన్త్ర్యావకాశ శ్చైశ్వర్యసంభావనా యోగేనా సంఖ్యాతోన్నతి కరణం చేతి.

అత్ర (౧) యజ్ఞానుష్ఠాన(౨) స్వరూప సంపాదక (౩) విద్వత్పరమాత్మప్రార్థనా (౪) విద్యా వ్యాప్తి విద్వద్వ్యాప్తి నిరూపణ (౫) మగ్న్యాదినా యజ్ఞసాధనం, (౬, ౭) సర్వవిద్యా నిమిత్త వ్యాఖ్యా ధ్యయనాధ్యాపన (౮) యజ్ఞవివృతి (౯) యోగాభ్యాసలక్షణం (౧౦) సృష్ట్యుత్పత్తి (౧౧) రీశ్వర సూర్యకర్మాభిధానం (౧౨) ప్రాణాపాన క్రియానిరూపణం (౧౩) విభోరీశ్వరస్య వ్యాప్త్యుక్తి (౧౪) ర్యజ్ఞానుష్ఠానం (౧౫) సృష్టే రుపకారగ్రహణం (౧౬) సూర్య సభాధ్యక్ష గుణాభిలాషో (౧౭) యజ్ఞానుష్ఠాన శిక్షాదానం (౧౮) సవితృ సభాధ్యక్షకృత్యోపదేశో (౧౯) యజ్ఞాత్సిద్ధి (౨౦) రీశ్వర సభాధ్యక్షాభ్యాం కార్యనిష్పత్తి (౨౧) రేతయోః స్వరూపకృత్యవర్ణన (౨౨)మీశ్వర విదుషాం వర్తమానం లక్షణం (౨౩) చేశ్వరోపాసనం (౨౪) శూరవీరగుణకథన (౨౫) మీశ్వర విద్యుద్గుణ వర్ణనం (౨౬) పరమైశ్వర్యప్రాప్తి (౨౭) రాకాశాదిదృష్టాంతేన విద్యుద్గుణవర్ణన (౨౮) మీశ్వరో పాసక గుణప్రకాశనం (౨౯) సర్వబంధనాద్విముక్తిః (౩౦) పరస్పరవర్ణనప్రకారో (౩౧) దుష్ట త్యాగేన విదుషాం సంగకరణావశ్యకతా (౩౨) మనుష్యైర్యజ్ఞసిద్ధయే విద్యాసంగ్రహణం చోక్త మతః పంచమాధ్యాయోక్తార్థానాం చతుర్థాధ్యాయోక్తార్థైః సాకం సంగతి రస్తీతి వేదితవ్యమితి. *

పదార్థము:-ఓ విద్వాంసుడా!సూర్యుని కభిముఖుడవై (ద్యాం)దాని ప్రకాశమును నేనెటుల కంటిమీద పడనీయనో అటులనే నీవును దానిని(మా లేఖీః)దృష్టిగోచరము కానీయకుము. నేనెటుల(అంతరిక్షం)యదార్థపదార్థముల అవకాశమును నాశనమొనర్చి, చెడగొట్టనో అటులనే నీవువానిని(మా హింసీః)నాశనమొనర్చకుము. నేనెటుల (పృథివ్యా) పృథివిని అనుకరించుచున్నానో అటులనే నీవును దానికితోడు(సం భవ)కమ్ము (హి)ఏకారణముచే(తేతిజానః)అత్యంతపదునుగల(స్వధితిః) ఈ వజ్రము శత్రువులను వినాశమొనర్చి ఐశ్వర్యమును ఇచ్చుచున్నదో(అతః)ఆకారణముచే(అయం)ఇతడు(త్వా)నిన్ను (మహాతే సౌభగాయ)అత్యంత సౌభాగ్యముకొఱకు సంపన్నమొనర్చునుగాక! ఇతర పదార్థములు ఎటుల ఐశ్వర్యమును(ప్రణినాయ) పొందుచున్నవో అటులనే నీకైశ్వర్యమును సమకూర్చుగాక!(దేవ)ఓ ఆనందయుక్తా!(వనస్పతే)వనముల రక్షించు విద్వాంసుడా!ఎటుల (శతవల్శః) వందలకొలది అంకురములుగల వృక్షము ఫలించుచున్నదో అటులనే నీవును ఈ ఉక్తప్రశంసనీయ సౌభాగ్యముతో(విరోహ)చక్కగా ఫలి[వ్యాపి]ంచుము. ఎటుల(సహస్రవల్శాః)వేలకొలది అంకురములుగల చెట్టు ఫలించునో అటులనే మేమును ఉక్తసౌభాగ్యముతో వికసించెదముగాక!

భావార్థము :- ఇట వాచకలుప్తోపమాలంకారమున్నది. ఈ సంసారమునందే మానవుడు విద్యాప్రకాశాభ్యాసమును, స్వాతంత్ర్యమును, మఱియు నన్నివిధముల స్వకార్యముల యున్నతిని పరిత్యజించగూడదు. [౨౦౮]

* దీని తెలుగనువాదము విషయసూచికగా అధ్యాయమునకు ముందు వివరించబడియున్నది.

ఇతి శ్రీ మత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత మహావిదుషాం విరజానంద సరస్వతీ స్వామినాం శిష్యేణ
దయానంద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్య భాషాభ్యాం
విభూషితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే
పఞ్చమోఽధ్యాయః పూర్తిమగాత్.

కృష్ణామండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు
పాలడుగు శేషాచలాచార్య, తదేవ మండలాంతర్గత ముదునూరు
గ్రామవాస్తవ్యుడు అన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన
శ్రీమద్దయానంద సరస్వతీ నిర్మిత యజుర్వేద భాషాభాష్యమందలి పంచమాధ్యాయము సమాప్తము.

ఓం

## పంచమాధ్యాయములోని ఛందస్సులు

ఈ అధ్యాయమునందు ౪౩ మంత్రములున్నవి. ౨,౫,౭,౨౨,౨౫,౨౬,౩౯, మంత్రములందు రెండేసి చొప్పునను, ౮ లో ౩; ౯ లో ౪; ౨౩ లో ౪ ఛందస్సులును ఉండుటవలన ౫౮ ఛందస్సులగుచున్నవి. ౮ వ మంత్రములో చివర రెండు నిచృదార్షీ బృహతులున్నవి. ౨౩ వ మంత్రములో మొదటి దాని తర్వాత అసురీగాయత్రి ౧౫ అక్షరముల దొకటి యున్నది. వీనిని మహర్షి నిర్దేశించలేదు.

౨౫ వ మంత్రములో బ్రాహ్మీజగతీ ౫౪ అక్షరములతోపాటు "వాం" అను ఆర్షీపంక్తి లోని మొదటి అక్షరమునుకూడ బ్రాహ్మీజగతీక్రిందకే మూలమునందు సూచించబడి యున్నది.

౬ వ మంత్రములో విరాడ్బ్రాహ్మీపంక్తికి ౫౮ అక్షరములుంటవి. కాని "యా తవ తనూ రియఙ్గ్ం" అను దానికి బదులు "యా తనూరియఙ్గ్ం" అని మూలములో తప్పు అచ్చుపడుటచే రెండక్షరములు తగ్గుచున్నవి. పదపాఠములో నైతే 'తవ' శబ్దమున్నది కావున చేర్చితిమి.

౩౯ వ మంత్రము IIలో౩ ౯ అక్షరములుండుటచే 'నిచృదార్షీ పంక్తి' యగును. ౩౨ భురిగార్షీ త్రిష్టుప్ (౪౫): ౩౫ లో ౫౨ అక్షరాలున్నవి కావున విరాడ్ బ్రాహ్మీ బృహతీ యగును. అప్పుడు మధ్యమ స్వరమగును.

ఇటుల ఈ యధ్యాయమునందు ౪౩ మంత్రములు, ౫౮ ఛందస్సులు, ౨౪౫౮ అక్షరాలున్నవి,

[కేశవార్యశాస్త్రి.]



*అధ్యాయారంభమున వేసిన తెలుగు విషయసూచిక ఇక్కడిది కావున దాని పుట ౩౬౭.

ఓం

# యజుర్వేద భాష్యము

## ( షష్ఠాధ్యాయము )



పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీమద్దయానంద సరస్వతీ స్వామినా నిర్మితస్య
సంస్కృతార్యభాషభ్యాం సమన్వితస్య
వి. శ. ౨౦౧౫ సంవత్సరే
శ్రీమత్పరోపకారిణీ సభయా ప్రకాశితస్య
యజుర్వేద భాష్యస్య
**ఆంధ్రానువాదః**



ప్రకాశకులు :
అన్నే మాధవరావు,
ఆర్య గ్రంథాలయము,
ముదునూరు P. O. (కృష్ణా జిల్లా)



అనువాదకులు :
పాలడుగు శేషాచలాచార్యులు,
అన్నే కేశవార్యశాస్త్రి.

దయానందాబ్దము ౧౩౪.
ఋషిబోధోత్సవము. (శివరాత్రి).
శా. శ. ౧౮౮౦, విళంబి
1959 మార్చి.

ప్రథమ ముద్రణము
౧౦౦౦ ప్రతులు.
వెల రు. 2.00

# [*విషయ సూచిక]

## —ఈ [షష్ఠ] అధ్యాయమునందు—


| [క్రమసంఖ్య] | [మంత్రములు] |
| --- | --- |
| ౧. రాజ్యాభిషేక పూర్వకముగ శిక్ష, రాజ్యకార్యములు | ౧ |
| ౨. ప్రజలకు రాజాశ్రయము | ౨, ౩ |
| ౩. సభాధ్యక్షులకార్యము | ౪ |
| ౪. విష్ణువుయొక్క పరమ పద వర్ణనము | ౫ |
| ౫. సభాధ్యక్షుడు ఈశ్వరోపాసన యొనరించుట | ౬ |
| ౬. రాజప్రజల పరస్పర కర్తవ్యము | ౭ |
| ౭. గురువు శిష్యుని చేరదీసి విద్యగఱపుట | ౮, ౯ |
| ౮. యజ్ఞానుష్ఠానము | ౧౦, ౧౧ |
| ౯. హోమ మొనర్చబడిన ద్రవ్య ఫలవర్ణనము | ౧౧ |
| ౧౦. విద్వల్లక్షణము | ౧౨ |
| ౧౧. మనుష్య కృత్యములు | ౧౩ |
| ౧౨. మనుష్యులు, పరస్పర ప్రవర్తన | ౧౪ |
| ౧౩. దుష్టదోష నివృత్తి ఫలము | ౧౫, ౧౬, ౧౭ |
| ౧౪. ఈశ్వరుని ఏమేమి అ[ప్రా]ర్థించ వలయును ? | |
| ౧౫. సంగర యోద్ధ వర్ణన | ౧౮ |
| ౧౬. యుద్ధ కృత్య [నిరూపణ] ము | ౧౯ |
| ౧౭. యుద్ధమందన్యోన్య ప్రవర్తన ప్రకారము | ౨౦ |
| ౧౮. వీరయోధుల నుత్సాహ పరచుట | ౨౧ |
| ౧౯. రాజ్య ప్రబంధ మొనర్చుట, సాధ్యసాధనము | ౨౨ |
| ౨౦. [రాజ్య కర్మకరణమును గురించి] రాజుకు ఈశ్వరోపదేశము | ౨౩ |
| ౨౧. రాజ్య కర్మానుష్ఠానము | ౨౪ |
| ౨౨. రాజు ప్రజల కృత్యములు | ౨౫ |
| ౨౩. రాజ ప్రజాసభల పరస్పర ప్రవర్తనము | ౨౬ |
| ౨౪. ప్రజలచే సభాపతి ఉత్కర్షించ బడుట | ౨౭ |
| ౨౫. ప్రజలకు సభాపతి ప్రేరణ | ౨౮, ౨౯ |
| ౨౬. ప్రజలు స్వీకరించదగిన సభాపతి లక్షణము | ౩౦ (?) |
| ౨౭. ప్రజా రాజ సభలు పరస్పరము ప్రతిజ్ఞ యొనర్చుట | ౩౧ |
| ౨౮. సభాపతి స్వీకరణ ప్రయోజనము | ౩౨ |
| ౨౯. ప్రజాసుఖమునకై సభాపతి కర్తవ్య కర్మల ననుష్ఠించుట | ౩౩ |
| ౩౦. సభాపత్యాదుల పత్నులు ఏమేమి [కార్యములు] చేయవలయును ? | ౩౪ |
| ౩౧. స్త్రీ పురుషుల పరస్పర ప్రవర్తన | ౩౫ |
| ౩౨. తల్లి దండ్రుల యెడ బిడ్డల కర్తవ్యము | ౩౬ |
| ౩౩. సభాపతికి, ప్రజాజనుల ఉపదేశము | ౩౭ |


వర్ణింపబడినవి. ఇటుల పంచమాధ్యాయమునందు చెప్పబడిన యర్థములతో నీ యాఱవ యధ్యాయార్థముల సంగతి కలదని గమనించవలయును.

---

సూచన :– మొదటి మూడు సంపుటములందును "గ్ం" అని వాడితిమి. నాగరి లిపిలో నిది ꣳ, ꣴ అని రెండు విధములుగా సూచించబడుచుండుటయే గాక, సంస్కృతమునకు చెప్పబడు ౬౩ అక్షరములలో నివియు ప్రత్యేకాక్షరములుగ లెక్కపెట్టబడినవి. వర్ణోచ్చారణ శిక్షయందు వీనిని అయోగవాహములని మహర్షి దయానందులు పేర్కొనియున్నారు. నాల్గవసంపుటమునుండి నాగరి లిపియందు వాడుచున్నటులనే ꣳ, ꣴ అను రూపద్వయమును వాడుచున్నాము.—ఆచార్యాదులు.

---

*ఇది చివర ఉండవలసినది. పాఠకుల సౌకర్యార్థము ముందు సమకూర్చుచున్నాము.—(అనువాదకులు)

ఓమ్

# అథ షష్ఠాధ్యాయస్యారమ్భః

విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ యద్భద్రం తన్న ఆసువ॥

౨౦౯. అథ దేవస్య త్వేత్యస్యాగస్త్య ఋషిః, సవితా దేవతా పంక్తిశ్ఛందః, ధైవతః స్వరః,
యవో౽సీత్యస్యాసురీ దివేత్యస్య చ భురిగార్షుష్ణిక్ ఛందసీ, ఋషభః స్వరః.

**అథ రాజ్యాభిషేకాయ సుశిక్షితం సభాధ్యక్షం విద్వాంసం ప్రత్యాచార్యాదయః**
**కిం కిముపదిశేయు రిత్యుపదిశ్యతే.**

పంచమాధ్యాయానంతరము షష్ఠాధ్యాయారంభము.

దీని ప్రథమ మంత్రమునందు రాజ్యాభిషేకమునకై సుశిక్షితుడైన సభాధ్యక్షుడగు విద్వాంసునికి ఆచార్యాది విద్వాంసులేమేమి యుపదేశించవలయునో చెప్పబడినది.

దేవస్య త్వా సవితుః ప్రసవే౽శ్వినో ర్బాహుభ్యా మ్పూష్ణో హస్తాభ్యా మాదదే నార్యసీదమహఀ రక్షసా గ్రీవా అపి కృంతామి। యవో౽సి యవయాస్మద్ద్వేషో యవయారాతీ ర్దివే త్వా౽న్తరిక్షాయ త్వా పృథివ్యై త్వా శుంధంతాఀ ల్లోకాః పితృషదనాః పితృషదన మసి॥ ॥౬.౧॥

దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు+భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, ఆ, దదే, నారి, అసి, ఇదమ్, అహమ్, రక్షసామ్, గ్రీవాః, అపి, కృంతామి, యవః, అసి, యవయ, అస్మత్, ద్వేషః, యవయ, అరాతీః, దివే, త్వా, అంతరిక్షాయ, త్వా, పృథివ్యై, త్వా, శుంధంతామ్, లోకాః, పితృషదనాః, పితృషదనా ఇతి పితృ+సదనాః, పితృషదనమ్, పితృషదనమితి పితృ+సదనమ్, అసి.

పదార్థః :-(దేవస్య)ద్యోతమానస్య(త్వా)త్వాం సభాధ్యక్షం (సవితుః) సర్వవిశ్వోత్పాదకస్య (ప్రసవే)యథేశ్వరసృష్టౌ(అశ్వినోః)ప్రాణోదానయోః(బాహుభ్యామ్)యథా బలవీర్యాభ్యామ్(పూష్ణః పుష్టి నిమిత్తస్య ప్రాణస్య(హస్తాభ్యామ్)ధారణాకర్షణాభ్యాం(ఆదదే)గృహ్ణామి.(నారి)యజ్ఞసహకారిణి(అసి)(ఇదమ్)యుద్ధాఖ్యం కృత్వా(అహం)(రక్షసాం)దుష్టకర్మకారిణామ్(గ్రీవాః)కంఠాన్(అపి)(కృంతామి)ఛినద్మి (యవః) సంయోగ విభాగకర్తా (అసి) (యవయ) వా ఛందసీతి వృద్ధ్యభావః

(అస్మత్)అస్మాకం సకాశాత్(ద్వేషః)ద్వేషకాన్(యవయ)వియుధి(అరాతీః)శత్రూన్(దివే)విద్యాది ప్రకాశాయ(త్వా)త్వాం న్యాయప్రకాశం(అంతరిక్షాయ) అంతరిక్షయమితి. అంతరిక్ష మిత్యంతరిక్ష నామసు పఠితమ్ నిఘం. ౧. ౩.(త్వా)సత్యానుష్ఠానావకాశదమ్(పృథివ్యై) భూరి రాజ్యాయ (త్వా) రాజ్యవిస్తారకమ్(శుంధంతామ్)(లోకాః)న్యాయదృష్ట్యా సమీక్షణీయాః(పితృషదనాః)యథా పితృషు సీదంతి తే, పితర ఇతి పదనామసు పఠితమ్ నిఘం. ౫.౫ (పితృషదనమ్)యథావిద్వత్ స్థానమ్. (అసి)అయం మంత్రః శ. ౩.౫.౪.౧-౨ వ్యాఖ్యాతః.

అన్వయః :- హే సభాధ్యక్ష! యథా పితృషదనా దేవస్య సవితుః ప్రసవే అశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వామాదదాతి, తథాఽహ మాదదే. యథాఽహం రక్షసాం గ్రీవాః కృంతామి, తథా త్వమపి కృంత. హే సభాధ్యక్ష: త్వం యవోఽస్యస్మద్ ద్వేషో యవయారాతీ ర్యవయ, తథాఽహం దివే త్వాఽన్తరిక్షాయ త్వా పృథివ్యై త్వా త్వాం శుంధామి. తథేమే పితృషదనా లోకాస్త్వాం శుంధంతామ్. యత స్త్వం పితృషదన మివాసి. తస్మాత్పితృపాలకో భవ. హే సభాపతేర్నారి! భవత్యాఽప్యేవమేవ కార్యమ్.

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే విద్యానిష్ణాతా ఈశ్వరసృష్టౌ స్వస్య పరేషాం చ దుష్టతాం విధూయ రాజ్యం సేవంతే తే సుఖినో భవన్తి.

పదార్థము :- ఓ సభాధ్యక్షా ! ఎటుల (పితృషదనాః) పితరులందు వసించు విద్వాంసులు (దేవస్య) ప్రకాశమయుడును (సవితుః)సకల విశ్వము నుత్పన్న మొనర్చువాడును నగు జగదీశ్వరునిచే (ప్రసవే) సృజింపబడిన సంసారమునందు (అశ్వినోః) ప్రాణాపానముల యొక్క (బాహుభ్యాం) బలముచేతను, ఉత్తమ వీర్యముచేతను, మఱియు (పూష్ణః) పుష్టి నిమిత్తమైన ప్రాణముయొక్క (హస్తాభ్యాం) ధారణాకర్షణ[శక్తులచే]తను (త్వా) నిన్ను గ్రహించుచున్నారో అటులనే నేను (ఆదదే) గ్రహించు చున్నాను.

ఎటుల నేను (రక్షసాం) దుష్టకార్యము లొనరించు జీవముల యొక్క (గ్రీవాః) కుత్తుకలను (కృంతామి) కత్తిరించి వేయుచున్నానో అటులనే (త్వం అపి) నీవును కత్తిరించుము.

ఓ సభాధ్యక్షా ! నీవు (యవః) సంయోగ విభాగము లొనర్చు వాడవై (అసి) ఉన్నావు. కావున (అస్మత్) నన్ను(ద్వేషః)ద్వేషించి ప్రీతి జూపని వైరులను(యవయ) వేరుజేయుము. మరియు (అరాతీః) నాకెవరు సదా శత్రువులై యున్నారో వారిని (యవయ) దూర మొనర్చుము.

న్యాయముగ రక్షణ యొనర్చు యోగ్యజనుడ నగు నే నెటుల (దివే) విద్యాది గుణములను ప్రకాశ మొనరించుట కొఱకు (త్వాం) న్యాయ ప్రకాశ మొనర్చు నిన్ను; (అంతరిక్షాయ) అభ్యంతర వ్యవహారమున రక్షణ మొనర్చుట కొఱకు (త్వాం) సత్యానుష్ఠానమున కవకాశ మిచ్చు నిన్ను;మరియు(పృథివ్యై)ధరణీరాజ్యము కొఱకు (త్వా) రాజ్యవిస్తార మొనర్చు నిన్ను పవిత్ర మొనరించు చున్నానో, అటులనే వీరును (త్వా) నిన్ను (శుంధంతామ్) పవిత్ర మొనర్చుదురు గాక! నీవు (పితృషదనమ్) విద్వాంసుల

గృహముతో సమానముగ(అసి)ఉన్నావు. కావున నీవు పితరులవలె సకల ప్రజలను పోషించుము. ఓ సభాపతియొక్క పడతీ! నీవును ఇటులనే ఒనర్చుము.

భావార్థము :— ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకార మున్నది. ఏ పురుషులు విద్యయందతివిచక్షణులై ఈశ్వర సృష్టియందు స్వకీయ పరకీయ దుష్టత్వములను తొలగింపజేసి,రాజ్యమును సేవించుదురో వారు సుఖసంయుక్తులగుదురు. [౨౯]

---

౨౧౦. అగ్రేణీరిత్యస్య శాకల్య ఋషిః, సవితా దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః, దేవస్త్వేత్యస్య స్వరాట్ పంక్తిశ్ఛందః, ధైవతః స్వరః.

**పునః సోఽభిషిక్తః సభాధ్యక్షః కథం ప్రవర్తేతేత్యుపదిశ్యతే.**

అభిషిక్తుడైన యధ్యక్షుడెటుల ప్రవర్తించవలయునను విషయమీ మంత్రమందు చెప్పబడినది.

అగ్రేణీరసి స్వావేశఽఉన్నేతౄణామేతస్య వి॒త్తాదధి త్వా స్థాస్యతి। దే॒వస్త్వా సవితా మధ్వానక్తు సుపిప్పలాభ్య స్త్వౌషధీభ్యః। ద్యామగ్రేణాస్పృక్ష ఆన్తరిక్షం మధ్యే నాప్రాః పృథివీ ముపరేణా దృꣳహీః॥ ॥౬.౨॥

అగ్రేణీః, అగ్రేణీ రిత్యగ్రే+నీః, అసి, స్వావేశ ఇతి సు+ఆవేశః, ఉన్నేతౄణామిత్యుత్+నేతౄణామ్, ఏతస్య వి॒త్తాత్, అధి, త్వా, స్థాస్యతి, దేవః, త్వా, సవితా, మధ్వా, అనక్తు, సుపిప్పలాభ్య ఇతి సు+పిప్పలాభ్యః, త్వా, ఓషధీభ్యః, ద్యామ్, అగ్రేణ, అస్పృక్షః, ఆ, అంతరిక్షమ్, మధ్యేన, అప్రాః, పృథివీమ్, ఉపరేణ. అదృꣳహీః.

పదార్థః:- (అగ్రేణీః)యథాధ్యాపకః శిష్యాన్ పితా స్వసంతానాన్ వా పురస్తాదేవ సుశిక్షయా విద్యాం ప్రాపయతి తథా(అసి) (స్వావేశః)యథాప్తః శోభనం ధర్మమావిశతి తథా నేతా(ఉన్నేతౄణాం)ఉత్కర్షప్రాపయితౄణాం రాజ్యం తథా ఏతస్య ప్రకృతం రాజ్యం పాలితుం (విత్తాత్) విజానీహి(అధి)ఉపరిభావే(త్వా)త్వామ్(స్థాస్యతి)(దేవః)అఖిల రాజ్యేశ్వరః(త్వా)త్వాం(సవితా) సర్వస్య విశ్వస్య జనితా.(మధ్వా)మధురగుణేన(అనక్తు)సించతు.(సుపిప్పలాభ్యః)యథా సుష్ఠు ఫలాభ్యః(త్వా త్వాం(ఓషధీభ్యః)ప్రసిద్ధాభ్యః(ద్యామ్)విద్యాన్యాయప్రకాశం(అగ్రేణ)పురస్తాత్ (అస్పృక్షః)స్పృశ. అత్ర సర్వత్ర లడర్థే లుఙ్(ఆ)సమంతాత్(అంతరిక్షమ్)ధర్మప్రచారస్యావకాశం(మధ్యమేన) మధ్యమావస్థావిశేషేణ(అప్రాః)పిపృహి(పృథివీమ్)భూమిరాజ్యమ్(ఉపరేణ)ఉత్కృష్టనియమేన (అదృꣳహీః)ప్రాప్య వర్ధస్వ. అయం మంత్రః శత.౩.౫.౪ ౯. వ్యాఖ్యాతః.

అన్వయః :— హే సభాధ్యక్ష ! యథాగ్రేణీ ర స్తి తథా త్వమసి. ఉన్నేతౄణాం స్వావేశః సన్నేతస్యైతం రాజ్యం విత్తాత్, హే రాజన్! యథా తే త్వాం రాజపురుషసమూహాః సుపిప్పలాభ్య ఓషధీభ్యో మధ్వానక్తు.ఏవం ప్రజాపురుషసమూహోఽపి త్వాం చానక్తు.త్వమగ్రేణ యశసా ద్యామ పృక్షో, మధ్యమేన నాంతరిక్షమాప్రాః, ఉపరేణ పృథివీం ప్రాప్యైవాదృంహీః. దేవః సవితా సర్వ ప్రేరకో జగదీశ్వరస్త్వాఽధి స్థాస్యతి.

భావార్థః :— నహి కశ్చిజ్జనో రాజప్రజాపురుషై రస్వీకృతో రాజ్యమర్హతి. న చాపి రాజ్ఞానా దృతః సామ్రాజ్యం,కీర్త్యనుక్రమేణ వినా సైన్యాపత్యం, దండనేతృత్వం, సర్వలోకాధిపతిత్వం చ.

పదార్థము :— ఓ సభాధ్యక్షా! ఎటుల (అగ్రే ణీః) చదివించువాడు స్వశిష్యులను, తండ్రి తన తనయులను పఠనారంభమునకు ముందునుండియే సుశిక్షుగఅపి సుశీలురుగను, జితేంద్రియులుగను,ధర్మాత్ములగను చేయుచున్నారో,అటులనే నీవు మాకందఱకు(అసి) అయి యున్నాడవు (ఉన్నే తౄణామ్)ఉత్కర్షను ప్రాప్తమొనరింప జేయువారి రాజ్యము వలె,పాలించగలుగునటుల (స్వావేశః) సుగుణము లందు ప్రవేశించు వారితో సదృశుడవై (ఏతస్య) ఈ రాజ్యపాలనమును (విత్తాత్) ఎరుగుము. ఓ రాజా! ఎటుల(త్వా) నిన్ను సభాసదులు (సుపిప్పలాభ్యః) మంచి మంచి ఫలములు గల (ఓషధీభ్యః) ఓషధులనుండి (మధ్వా) నిష్పాదన మొనర్చిన మాధుర్యముగా నుండు రసములతో (అనక్తు) సించన మొనర్చుదురో, అటులనే ప్రజాజనులుకూడ నిన్ను సించన మొనర్చెదరుగాక ! నీవు ఈ రాజ్యములో స్వకీయ (అగ్రేణ) ప్రథమ యశస్సుతో (ద్యాం) విద్య మరియు రాజనీతి యొక్క ప్రకాశమును (అస్పృక్షః) స్పర్శించుము (మధ్యమేన)మధ్యన—తదనంతరము లభ్యమైన యశస్సుచే(అంతరిక్షమ్) ధర్మమును విచారించు మార్గమును (అప్రాః) పూరించుము మరియు (ఉపరేణ) స్వకీయ రాజ్య నియమములతో (పృథివీమ్) ఈ భూమిస్థ రాజ్యమును పొందియు(అదృంహీః) దృఢులై ముందడుగు వేయకుడు.† (దేవః)రాజాధి రాజు (సవితా)సకల జగత్తును అంతర్యామియై ప్రేరేపించు జగదీశ్వరుడు (త్వా)నిన్ను రాజుగా నొనర్చి, (స్థాస్యతి) నీకధిష్ఠాతయై యుండును.

భావార్థము:—ప్రజలద్వారా స్వీకరించబడని రాజు రాజ్య మొనర్చుటకు అర్హుడు కాడు. రాజుచేగాని, సభచేగాని ఆదరముగా ఆహ్వానించ బడని వాడును మంత్రి యగుటకును, తనకీర్తిని ఉత్తరోత్తరము దృఢ మొనర్చుకొనజాలని వాడు సేనాప్రశాసకుడగుటకును, యథా యోగ్యముగ న్యాయముతో దండించుట కనగా, న్యాయాధీశుడగుటకును, రాజ్య మండలాధిపత్యమునకును యోగ్యుడు కాజాలడు. [౨౧౦]

---

౨౧౧. యా తే ధామానీత్యస్య దీర్ఘతమా ఋషిః, విష్ణు ర్దేవతా ఆర్చ్యుష్ణిక్ ఛందః, అత్రాహేతీత్యస్య సామ్న్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః, బ్రహ్మవనిత్వేత్యస్య నిచృత్ప్రాజాపత్యా బృహతీ ఛంధః, మధ్యమః స్వరః.

పున స్తం కీదృశం విదిత్వా వాణిజ్యకర్మ కుర్వాణాః జనా ఆశ్రయ న్తీదముపదిశ్యతే.

---

† దృఢముగా పెంపొందించుమని శ్రీ. పం. బ్రహ్మదత్త జిజ్ఞాసుగారి పాఠము.

వణిజు లతని నెటుల భావించి యాశ్రయించుదురో యీ మంత్ర మందుపదేశించెను.

యా తే ధామాన్యుశ్మసి గమధ్యై యత్ర గావో భూరిశృఙ్గా అయాసః।
అత్రాహ తదురుగాయస్య విష్ణోః పరమమ్పదమవ భారి భూరి। బ్రహ్మవని త్వా క్షత్రవని రాయస్పోషవని పర్యూహామి బ్రహ్మ దృꣳహ క్షత్రం దృꣳహాయు ర్దృꣳహ ప్రజాన్దృꣳహ॥ ॥౬.౩॥

యా, తే, ధామాని, ఉశ్మసి, గమధ్యై, యత్ర, గావః, భూరిశృఙ్గా ఇతి భూరిశృఙ్గాః, అయాసః, అత్ర, అహ, తత్, ఉరుగాయస్యేత్యురు+గాయస్య, విష్ణోః, పరమమ్, పదమ్, అవ, భారి, భూరి, బ్రహ్మవనీతి బ్రహ్మ+వని, త్వా, క్షత్రవనీతి క్షత్ర+వని, రాయస్పోషవనీతి రాయస్పోష+వని, పరి, ఉహామి, బ్రహ్మ, దృꣳహ, క్షత్రమ్, దృꣳహ, ఆయుః, దృꣳహ, ప్రజామితి ప్రజామ్, దృꣳహ.

పదార్థః :– (యా) యాని(తే) తవ సభాధ్యక్షస్య(ధామాని)దధతి సుఖాని యేషు తాని రాజ్యప్రబంధస్థాపనాని దేశదేశాంతరవాణిజ్యార్హాణి (ఉశ్మసి) ఉశ్మః కామయామహే (గమధ్యై)గంతుం ప్రాప్తుం (యత్ర) యేషు(గావః) రశ్మయః, గావ ఇతి రశ్మినామసు పఠితమ్. నిఘం. ౧.౫.(భూరిశృఙ్గాః)భూరీణి శృఙ్గాణి ప్రకాశా యాసు తాః.శృఙ్గాణీతి ప్రజ్వలన నామసు పఠితమ్ నిఘం.౧.౧౭. (అయాసః) అయన్త ఇత్యయాసః మహీధరేణాత్రాయ గతావిత్యస్య యదయంతీతి పరస్మైపదముక్తం తదసదాత్మనేపదోపయోగ్యత్వాత్. (అత్ర) యేషు (అహ) నిశ్చయే (తత్) తస్య (ఉరుగాయస్య) ఉరుర్బహుర్గాయః స్తుతిర్యస్య తస్య. అత్ర గై శబ్ద ఇత్యస్మాద్ ఘఞర్థే కవిధానమితి కర్మణి కః (విష్ణోః) వ్యాపకస్య పరమేశ్వరస్య (పరమమ్) సర్వథోత్కృష్టమ్ (పదమ్) పత్తుం యోగ్యం (అవ) క్రియాయోగే(భారి)భ్రియతే. అత్ర లజర్థే లుఙ్. భృఞ్ ధాతోశ్చిణి పరేఽడభావః. అత్ర బహులం ఛందస్యమాఙ్ యోగేఽపీతి సూత్రేణాడభావః(భూరి)బహు(బ్రహ్మవని)బ్రహ్మణో వేతౄణాం సంవిభక్తారం తత్తథా (త్వా) త్వామ్ (క్షత్రవని) క్షత్రస్య రాజ్యస్య క్షత్రియాణాం వా సంవిభాజకమ్ (రాయస్పోషవని) రాయో ధనస్య పోషో దృఢతాం సంవిభాజినమ్ (పరి) పరితః (ఊహామి) వివిధతయా తర్కయామి. (బ్రహ్మ) పరమాత్మానం వేదం వా (దృంహ) స్థిరీకురు (క్షత్రమ్) రాజ్యం ధనుర్వేదవిదం క్షత్రియం వా (దృంహ) ఉన్నయ (ఆయుః)జీవనమ్(దృంహ) ప్రజాం స్వసంతానాన్ సంరక్షణీయాన్ జనాన్ (దృంహ)బ్రహ్మచర్యరాజ్యధర్మాభ్యాం పరిపాలయ.

అత్రాహ యాస్కమునిః–తా వాం వాస్తూన్యుశ్మసి గమధ్యై.యత్ర గావో భూరిశృఙ్గా అయాసః. అత్రాహ తదురుగాయస్య విష్ణోః పరమం పదమవభాతి భూరి తాని వాం వాస్తూని కామయామహే. గమనాయ యత్ర గావో భూరిశృంగా బహుశృఙ్గాః, భూరితి బహునామధేయం ప్రభవతీతి సతః

శృఙ్గం శ్రయతే ర్వా శృణోతే ర్వా శమ్నాతే ర్వా శద్గరణాయోతమితి వా శిరసో నిర్గతమితి వాఽయా సోఽయనా స్తవ తదురుగాయస్య విష్ణో ర్మహాగతేః పరమం పదం పరార్ధ్యస్థ మవభాతి భూరిపాదః పద్యతే. నిరు. ౨. ౭.

అన్వయః :- హే సభాధ్యక్ష! యా యాని తే ధామాని గమధ్యై గంతుం వయముశ్మసి తాని కిం భూతాని సన్తి? యత్ర యేషూరుగాయస్య విష్ణో ర్భూరిశృఙ్గా గావో అయాసో భవన్తి, తదుక్త న్యాయమార్గాః ప్రకాశంత ఏవేతి యావత్. అత్రాహ-ఏషు హి తత్త్వస్య విష్ణోః పరమం పదం విద్వద్భి ర్భూర్యవభారి. అతస్త్వాం యథా బ్రహ్మవని, యథా క్షత్రవని, యథా రాయస్పోషవని, తథా పర్యూహామి త్వం బ్రహ్మ దృంహ, క్షత్రం దృంహాయుర్దృంహ, ప్రజాం చాపి దృంహ.

భావార్థః :- నహి సభాధ్యక్షరక్షితస్థానకామనయా వినా కశ్చిదపి సుఖం ప్రాప్తుం శక్నోతి. నహి కోఽపి జనః పరమేశ్వర మనాదృత్య ధర్మరాజ్యం భోక్తుమర్హతి. నైవ కోఽపి విజ్ఞానం సేనాం జీవనం ప్రజాం చారక్షిత్వా సమేధత ఇతి.

పదార్థము :— ఓ సభాధ్యక్షా ! (యా)(తే)నీయొక్క (ధామాని) ప్రాణములు సుఖము పొందదగు స్థానములు, ధామములేవియున్నవో వానిని మేము (గమధ్యై) (ఉశ్మసి) పొందుట కిచ్ఛగించు చున్నాము. ఆ స్థానము లెటులున్నవనగా:— సూర్యుని ప్రకాశము వలె ఉన్నవి. అటులనే (యత్ర) వేనిలో (ఉరుగాయస్య) స్తుతించ యోగ్యుడును (విష్ణోః) సర్వవ్యాపకుడును నగు పరమేశ్వరుని (భూరి శృంగాః) అత్యంత ప్రకాశము గల (గావః)కిరణములు లేక చైతన్యకళ(అయాసః)వ్యాపించి యున్నవో(అత్ర) (అహ) వానిలోనే (తత్ పరమం పదమ్) ఆ పరమేశ్వరుని సర్వోత్తమమును, ప్రాప్త యోగ్యమును నగు పరమ పదమును విద్వాంసులు (భూరి, అవ, భారి) అన్నివిధముల అవధారణ మొనర్చిరి. కావున (త్వా) నీకు (బ్రహ్మవని) పరమేశ్వరుని లేక వేద విజ్ఞానమును(క్షత్రవని)రాజ్యకాంక్షను, వీరుల కోరికను.(రాయస్పోషవని)ధనపుష్టిని విభాగ మొనర్చు[విధానమును]నీకు నేను(పర్యూహామి)వివిధ తర్కములతో నచ్చజెప్పు చున్నాను. అదేమనగా—నీవు(బ్రహ్మ)పరమాత్మను, వేదమును(దృంహ)స్థిర పఱచుము. అనగా స్వచిత్తమందు స్థిరపఱచి వృద్ధిజెందుము.(క్షత్రం)రాజ్యమును, ధనుర్వేదవేత్తలగు క్షత్రియులను(దృంహ)అభివృద్ధిపఱచుము.(ఆయుః)స్వంత ఆయుస్సును(దృంహ)పెంచుము. బ్రహ్మచర్యముచేతను, రాజధర్మముచేతను దృఢపఱచుము. మఱియు (ప్రజామ్) స్వ సంతానమును, రక్షించ తగిన ప్రజాజనమును (దృంహ) ఉన్నతి పఱచుము.

భావార్థము:—సభాధ్యక్షుని ద్వారా సురక్షితము లగు స్థానములను కామించక యే మానవుడు సుఖమును పొందజాలడు. పరమేశ్వరుని అనాదర పఱచియు నే పురుషుడు చక్రవర్తి [ధర్మ] రాజ్యమును భోగించుట కర్హుడు కాజాలడు. ఏ మనుష్యుడు విజ్ఞానమును, సేనను, ఆయువును, సంతానమును, ప్రజను రక్షించనిదే సమభివృద్ధిపొంద జాలడు. [౨౧౧]

౨౧౨. విష్ణోః కర్మాణీత్యస్య మేధాతిథిర్ఋషిః, విష్ణుర్దేవతా, నిచృద్గాయత్రీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.
అథ సభాధ్యక్షః సభ్యాదీన్ మనుష్యాన్ ప్రతి కిం కిముపదిశేదిత్యాహ.

సభాపతి సభాసదుల కేమి యుపదేశించవలయునో యీ మంత్రమందు చెప్పబడినది.

విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే।
ఇంద్రస్య యుజ్యః సఖా॥　　　　॥౬. ४॥

విష్ణోః, కర్మాణి, పశ్యత, యతః, వ్రతాని, పస్పశే, ఇంద్రస్య

పదార్థః:-(విష్ణోః)వ్యాపకస్య(కర్మాణి)జగత ఉత్పత్తి స్థితి సంహృత్యాదీని(పశ్యత) సంప్రేక్షధ్వమ్(యతః)యేన విజ్ఞానేన (వ్రతాని) నియత సత్యభాషణాదీని.(పస్పశే) బధ్నాతి. అత్ర లడర్థే లిట్(ఇంద్రస్య)పరమేశ్వరస్య(యుజ్యః)యునక్తి సదాచారేణేతి యుజ్యః. అత్రౌణాదిః కప్(సఖా) మిత్రమ్. అయం మంత్రః శత. ౩ ౫,४.౧౭. వ్యాఖ్యాతః.

అన్వయః :- హే సభ్యజనాః యూయం యథేంద్రస్య యుజ్యః సఖా విష్ణోః కర్మాణి పశ్యన్నహం యతో విజ్ఞానేన మనసి వ్రతాని సత్యభాషణాది నియమాన్ పస్పశే బధ్నామి,తథా తేనైవ విజ్ఞానేన తాని యూయం పశ్యత. యతో రాజ్యకర్మణి సత్యానుష్ఠాతారో భవత.

భావార్థః :- నహి పరమేశ్వరావిరోధ సత్యాచరణాభ్యాం వినా కశ్చిదీశ్వరగుణకర్మస్వభావాన్ ద్రష్టుమర్హతి. న తథాభూతేన వినా రాజ్యకర్మాణి యథార్థతయా సేవితుం శక్నోతి. నో ఖలు సత్యాచరణమంతరా రాజ్యం వర్ధయితుం ప్రభుర్భవతి.

పదార్థము :— ఓ సభాసదులారా! ఎటుల (ఇంద్రస్య) పరమేశ్వరునకు(యుజ్యః) సదాచార యుక్తుడైన(సఖా)మిత్రుడగు నేను(విష్ణోః)ఆ వ్యాపక పరమేశ్వరుని యొక్క (కర్మాణి) సంసారమును సృష్టించుట, పాలించుట, సంహరింపజేయుట మొదలగు సత్య గుణము లేవి యున్నవో వానిని చూచుచు (యతః) ఏ జ్ఞానముతో(వ్రతాని) స్వమనమున సత్యభాషణాది నియమములను (పస్పశే) బంధించుచున్నానో అటులనే ఆ విజ్ఞానముతోనే మీరును పరమేశ్వరుని ఉత్తమ గుణములను (పశ్యత)దృఢముగా చూడుడు. దానివలన రాజ్యాది కార్యము లందు సత్యవ్యవహారము లొనర్చు వారలు గండు.

భావార్థము:—పరమేశ్వరుని యందు ప్రీతి యుంచనిదే, సత్యాచరణము లొనర్చనిదే, యే మర్త్యుడును ఈశ్వరుని గుణ కర్మ స్వభావములను గమనించుట కర్హుడు కాజాలడు. అటుల కాకుండా రాజ్య కార్యములను యథార్థ న్యాయముతో నిర్వహించజాలడు. సత్య ధర్మాచరణములు లేని జనుడును రాజ్యమును వర్ధింపజేయుటకు సమర్థుడు కాజాలడు.　　　　[౨౧౨]

౨౧౩. తద్విష్ణోరిత్యస్య మేధాతిథి ర్ఋషిః, విష్ణు ర్దేవతా, నిచృదార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.
తదనుష్ఠానేన కిం ఫలమిత్యాహ.

అతను ప్రజలనుగూర్చియు, ప్రజలతనినిగూర్చియు నేమియొనరించవలయునో ఈ మంత్ర మందుపదేశించబడెను.

ఉపావీరసి ఉపదేవా న్దైవీ ర్విశః ప్రాగురుశిజో వహ్నితమాన్।
దేవ త్వష్ట ర్వసు రమ హవ్యా తే స్వదంతామ్॥ ౬.౭.॥

ఉపావీరిత్యుప+అవీః, అసి, ఉప, దేవాన్, దైవీః, విశః, ప్ర, అగుః, ఉశిజః, వహ్నితమానితి వహ్నితమాన్, దేవ, త్వష్టః, వసు, రమ, హవ్యా, తే, స్వదంతామ్.॥

పదార్థః :-(ఉపావీ)ఉపాగత పాలక ఇవ(అసి)(దేవాన్) విదుషః (దైవీః) దేవ సంబంధినీ ర్దివ్యాః(విశః)ప్రజాః(ప్ర)ప్రకృష్టార్థే(అగుః)అగమన్(ఉశిజః) కమనీయాన్ (వహ్నితమాన్) అతిశ యితా వహ్నాయో వోఢార స్తాన్(దేవ)దివ్యగుణసంపన్న!(త్వష్టః)సర్వదుఃఖచ్ఛిత్ (వసు) వసూని ధనాని. అత్ర సుపాం సులుగితి శసో లుక్(రమ)రమస్వ. అత్రాత్మనేపదే వ్యత్యయేన పరస్మైపద మ్(హవ్యా)హోతుమత్తుమర్హాణి(తే)తవ స్వదంతామ్)భుంజతామ్. అయం మంత్రః ౩.౫,౯-౧౨. కి.

అన్వయః :- హే దేవ! త్వష్టః! సభాపతే!యత స్త్వ ముపావీరివాసి, తస్మాద్దైవీ ర్విశో యథా ఉశిజో వహ్నితమాన్ దేవాన్ ఉపప్రాగు స్తథా త్వాం ప్రాప్నువంతి, యథైతా స్త్వదాశ్రయేణాఢ్యా భూత్వా రమన్తే, తథా త్వమపి తాసు రమ రమస్వ, భవానేతేషాం పదార్థాన్ భుంక్తే, తథైతే తే హవ్యా హోతు మర్హాణి హవ్యాని వసు వసూని స్వదన్తామ్.

భావార్థః :- యథా గుణగ్రాహిణ ఉత్తమగుణం సేవన్తే, తథా న్యాయవిచక్షణం రాజానం ప్రజాశ్చ సేవన్తే, యేన మిథః ప్రీత్యా పరస్యోన్నతి ర్భవతీతి.

పదార్థము :- ఓ దేవా! దివ్యగుణసంపన్నా!(త్వష్టః)సకల దుఃఖములను ఛేదించు సభాధ్యక్షా! నీవు(ఉపావీః)శరణాగత పాలకునితో సదృశుడవై(అసి)యున్నావు. కావున (దైవీః)విద్వాంసులతో సంబంధముంచు దివ్యగుణ సంపన్నులైన(విశః) ప్రజలు (ఉశిజః) శ్రేష్ఠగుణ శోభితులను, కామనకు యోగ్యులును, (వహ్నితమాన్) అతిశయ ధర్మపథ మున నడచువారును, నడపించువారునునగు(దేవాన్)విద్వాంసులను(ఉపప్రాగుః)ఎటుల సమీపించుదురో అటులనే నిన్నును సమీపించుచున్నారు. ఎటుల ప్రజలు నీ ఆశ్రయము వలన ధనాఢ్యులును సుఖులునునై ఉందురో, అటులనే నీవును ప్రాప్తమైన ప్రజాజనుల ద్వారా సత్కృతుడవై(రమస్వ)[వారిపట్ల]హర్షితుడవుకమ్ము. ఎటుల నీవు ప్రజల పదా ర్థములను భోగించుచున్నావో, అటులనే ప్రజలు నీయొక్క(హవ్యా)భోగయోగ్యము లగు అమూల్యమైన(వసు)ధనాది పదార్థములన(స్వదంతామ్)భోగించెదరుగాక!

భావార్థము:- ఎటుల గుణగ్రహణ పారీణులు ఉత్తమగుణవంతుడగు విద్వాంసుని సేవించెదరో అటులనే పరస్పర ప్రీతితో సకల జనులకు ఉన్నతి చేకూర్చుటకై ప్రజలును న్యాయవిచక్షణుడగు రాజును సేవించుదురు [౭౧౫]

౭౧౬. రేవతీ రమధ్వ మిత్యస్య దీర్ఘతమా ఋషిః, బృహస్పతి ర్దేవతా, ప్రజాపత్యనుష్టుప్ ఛన్దః, ఋషభ, స్వరః, ఋతస్య త్వేత్యస్య నిచృత్ ప్రాజాపత్యా బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ పిత్రాదయః స్వసంతానాన్ కథమధ్యాపకాయ ప్రదద్యుః స చ తాన్ కథం గృహ్ణీయా దిత్యుపదిశ్యతే.

పిత్రాదులు తమ సంతానమును అధ్యాపకులకెటుల అప్పగించవలయును? వారెటుల వారిని స్వీకరించవలయును ? అను విషయములిందుపదేశించబడినవి.

రేవ॑తీ రమ॑ద్ధ్వం బృహ॑స్పతే ధా॒రయా॒ వసూ॑ని।

ఋత॑స్య త్వా దేవహవిః పా॑శేన॒ ప్రతి॑ ముఞ్చామి॒ ధర్షా॒ మాను॑షః॥౬.౮॥

రేవ॑తీః, రమ॑ధ్వమ్, బృహ॑స్పతే, ధా॒రయ॑, వసూ॑ని, ఋత॑స్య, త్వా॒, దే॒వ॒హ॒వి॒రితి॑ దేవహవిః, పా॑శేన, ప్రతి॑, ము॒ఞ్చా॒మి॒, ధ॒ర్ష, మాను॑షః॥

పదార్థః:-(రేవతీః)రాయః ప్రశస్తాని ధనాని విద్యన్తే యాసు తాః ప్రజాః(రమధ్వమ్)క్రీడధ్వమ్ (బృహస్పతే)బృహత్యా వేదవాచః పతేః పాతః పరమవిద్వన్!(ధారయ)అత్రాన్యేషామపి దృశ్యతే ఇతి దీర్ఘః(వసూని)(ఋతస్య)సత్యన్యాయాఖ్య యజ్ఞస్య(దేవహవిః)యథా దేవానాం హవి రాదాతు మర్హం చరిత్రమస్తి తథా(పాశేన)బంధనేన(ప్రతి)(ముఞ్చామి)(ధర్ష)ధృష్ణుహి, ద్వ్యచోతస్తిజ ఇతి దీర్ఘః. వికరణవ్యత్యయేన శప్ చ(మానుషః)సర్వశాస్త్ర మననశీలః. అయమ్మన్త్రః శత౦౩,౫.౨.౧౩

అన్వయః:-హే(రేవతీః)రేవత్యః ప్రజాః యూయం విద్యాసు శిక్షాసు రమధ్వమ్, హే బృహస్పతేః త్వమృతస్య వసూని ధారయ. అథ శిష్యాయోపదిశతి గురుః. హే రాజన్! ప్రజాజన ! వా మానుషోఽహం పాశేనావిద్యాబంధనేన దేవహవి ర్యథా తథా త్వాం ప్రతి ముఞ్చామి. త్వం విద్యాసు శిక్షాసు ధర్ష ధృష్టో భవ.

భావార్థః:-విద్వద్భిః సుశిక్షయా కుమారాణాం కుమారీణాం చ జగదీశ్వరాత్ పృథివీపర్యంత పదార్థానాం బోధః సంపాదనీయో, యతస్తే మూర్ఖత్వబంధనం పరిత్యజ్య సదా సుఖినః స్యు రితి.

పదార్థము :-(రేవతీః)ప్రశస్తధనముగల ఓ సంతానమా! ప్రజలారా! మీరు విద్యయందు సుశిక్షయందు(రమధ్వమ్) రమించుడు. (బృహస్పతే) వేద వాణిని పాలించునో విద్వాంసుడా!నీవు(ఋతస్య)సత్య న్యాయ వ్యవహారములచే లబ్ధమగు(వసూని)ధనమును, మేమొసగిని ద్రవ్యాది పదార్థములను(ధారయ) స్వీకరించుము.

ఇక శిష్యునకు గురువుపదేశించుచున్నాడు. ఓ రాజా! లేక ఓ ప్రజాజనమా! (మానుషః)సకలశాస్త్రములను విచారించు నేను నిన్ను[(దేవహావిః)దేవతల హావిస్సును గ్రహించ యోగ్యమగు నడవడిగలవానిగా నొనర్చి](పాశేన) అవిద్యాబంధనము నుండి (ప్రతి ముంచామి) విడిపించుచున్నాను. నీవు విద్యయందును, సుశిక్షయందును, [(ధర్ష)] ధృష్టు[దిట్టమైనవా] డవుకమ్ము. [౨౧౬]

భావార్థము :- విద్వాంసులు తమశిక్షణచే కుమార బ్రహ్మచారులకు, కుమారి బ్రహ్మచారిణులకు పరమేశ్వరునుండి పృథివీపర్యంతము సకల పదార్థములను బోధించవలయును. దానివలన వారు అవివేక బంధనములనువీడి సదాసుఖులుగానుండగలుగుదురు.

---

౨౧౭. దేవస్య త్వేత్యస్యౌతథ్యో దీర్ఘతమా ఋషిః సవితా, అశ్వినౌ, పూషా చ దేవతాః. ప్రజాపత్యా బృహతీఛందః, మధ్యమః స్వరః, అగ్నీషోమాభ్యా మిత్యస్య పంక్తిశ్ఛన్దః, ధైవతః స్వరః.

పునః స శిష్యం కిముపదిశేదిత్యాహ.

ఆ గురువు శిష్యునకేమి యుపదేశించవలయునను విషయమిందు పొందుపరచబడినది.

దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యా మ్పూష్ణో హస్తాభ్యామ్। అగ్నీషోమాభ్యాఞ్జుష్టన్నియునజ్మి। అద్భ్య స్త్వౌషధీభ్యోఽ నుత్వా మాతా మన్యతా మను పితానుభ్రాతా సగర్భ్యోఽను సఖా సయూథ్యః। అగ్నీషోమాభ్యా న్త్వా జుష్ట మ్ప్రోక్షామి॥ ॥౬.౯.॥

దేవస్య, త్వా, సవితుః, ప్రసవఇతి ప్రసవే,అశ్వినోః, బాహుభ్యామితి బాహుభ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, అగ్నీషోమాభ్యామ్, జుష్టమ్, ని,యునజ్మి, అద్భ్య ఇత్యద్భ్యః, త్వా,ఓషధీభ్యః, అను, త్వా, మాతా, మన్యతామ్, అను, పితా, అను, భ్రాతా, సగర్భ్య+ఇతి సగర్భ్యః, అను, సఖా, సయూథ్య ఇతి సయూథ్యః, అగ్నీషోమాభ్యామ్, త్వా, జుష్టం, ప్ర, ఉక్షామి॥

పదార్థః :-(దేవస్య)వేదవిద్యాప్రకాశకస్య(త్వా)త్వాం విద్యార్థినమ్.(సవితుః)సకలైశ్వర్యవతః (ప్రసవే)ప్రసూయతే విశ్వస్మిన్ యస్తస్మిన్(అశ్వినోః)సూర్యాచంద్రమసోః (బాహుభ్యామ్) తత్తద్ గుణాభ్యామ్.(పూష్ణః) పృథివ్యాః. పూషేతి పృథివీ నామసు పఠితమ్ నిఘం. ౧.౧. (హస్తాభ్యామ్) హస్త ఇవ వర్తమానాభ్యాం ధారణాకర్షణాభ్యామ్ (అగ్నీషోమాభ్యామ్) ఏతయోస్తేజః శాన్తిగుణాభ్యామ్(జుష్టమ్)ప్రీతమ్ (ని) (యునజ్మి) (అద్భ్యః) యథా జలేభ్యః(ఓషధీభ్యః) రోగనివారికాభ్యః (అను)(త్వా)త్వామ్(మాతా)జననీ(మన్యతామ్)(అను)(పితా)జనకః(అను)(భ్రాతా)(బంధుః) (సగ

ర్భ్యః)సోదరః(అను)(సఖా)సుహృత్(సయూథ్యః)ససైన్యః (అగ్నీషోమాభ్యామ్) పూర్వోక్తాభ్యామ్ (త్వా)జుష్టమ్(ప్రీతమ్)(ప్ర ఉక్షామి)సిఞ్చామి. అయం మన్త్రః శత.౩.౭.౪,౩-౫.వ్యాఖ్యాతః.

అన్వయః :- హే శిష్య! అహం సవితు ర్దేవస్య ప్రసవే అశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వా త్వామాదదే. అగ్నీషోమాభ్యాం జుష్టం త్వా త్వాం యే బ్రహ్మచర్య ధర్మాను కూలా అప ఓషధయశ్చ స న్తి, తాభ్యోఽద్భ్యః ఓషధీభ్యో నియునజ్మి. త్వాం మత్సమీపే స్థాతుం మాతా జననీ అనుమన్యతామ్, పితాఽనుమన్యతామ్, సగర్భ్యః భ్రాతాఽను మన్యతామ్, సఖాఽను మన్యతామ్, సయూథ్యోఽను మన్యతామ్, అగ్నీషోమాభ్యాం జుష్టం ప్రీతియుక్తం త్వామహం ప్రోక్షామి, తద్గుణై రభిషించామి.

భావార్థః :- అస్మిన్ సంసారే మాత్రాదిభిః పిత్రాదిభి ర్బన్ధువర్గై ర్మిత్రవర్గైశ్చ స్వాపత్యాదీని సుశిక్ష్య తై ర్బ్రహ్మచర్యం కారయితవ్యం యత స్తే సద్గుణినః స్యురితి.

పదార్థము:-ఓ శిష్యా! నేను(సవితుః)సమస్తైశ్వర్యయుక్తుడును(దేవస్య)వేదవిద్యను ప్రకాశపఱచువాడుననగు పరమేశ్వరునిచే(ప్రసవే)ఉత్పన్నమొనర్చబడిన యీ జగత్తులో (అశ్వినోః)సూర్యచంద్రులయొక్క(బాహుభ్యామ్)[తత్తద్]గుణములచేతను [పూష్ణః] భూమికి(హస్తాభ్యామ్)హస్తములవలెనుండు,ధారణాకర్షణ[మొనర్చు] గుణములచేతను (త్వామ్)నిన్ను(ఆదదే)స్వీకరించుచున్నాను. మరియు (అగ్నీషోమాభ్యామ్) అగ్నియొ క్కయు,సోమముయొక్కయు తేజశ్శాన్తి గుణములచే(జుష్టమ్)ప్రీతి యొనరించుచున్న (త్వా)నిన్ను, బ్రహ్మచర్య ధర్మానుకూలములగు నే జలములు, ఓషధులున్నవో ఆ(అద్భ్యః)జలములతోను(ఓషధీభ్యః)గోధుమలు మొదలగు అన్నములతోను (నియునజ్మి) నియుక్తపఱచుచున్నాను. నా సమీపమున నుండుటకు నిన్ను నీ (మాతా) జనని (అను) (మన్యతామ్)ఆమోదించునుగాక!(పిత)పితఆమోదించునుగాక!(సగర్భ్యః)సహోదరులు, (భ్రాతా)అన్నదమ్ములు(అను)అనుమోదింతురుగాక! (సఖా) మిత్రులు(అను) అనుమోదింతురుగాక! మరియు (సయూథ్యః) నీ సహవాసులు (అను) అనుమోదింతురుగాక! (అగ్నీషోమాభ్యామ్) అగ్ని మరియు సోమములయొక్క తేజశ్శాంతి గుణములచే (జుష్టమ్)ప్రీతియొనరించుచున్న(త్వా)నిన్ను(ప్ర ఉక్షామి) ఆ గుణములతోనే బ్రహ్మచర్య నియమములను పాలించుటకు అభిషేకించుచున్నాను.

భావార్థము :- ఈ సంసారమున మాతా పితృ బంధు మిత్రవర్గ మంతయు తమ సంతానాదులకు సుశిక్షగఱపి బ్రహ్మచర్యము ననుష్ఠింపజేయవలయును. దాని వలన వారు గుణవంతులయ్యెదరు. [౨౧౮]

---

౨౧౯. అపాం పేరురిత్యస్య మేధాతిథి ర్ఋషిః, ఆపో దేవతా, ప్రాజాపత్యా బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః. సంత ఇత్యస్య నిచృదార్షీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

**అథోపనీతేన శిష్యేణ విద్యాసుశిక్షాగ్రహణాగ్ని హోత్రాది యజ్ఞోఽవశ్యమనుష్ఠాతవ్య ఇతి గురు రుపదిశేత్.**

యజ్ఞోపవీతధారణానంతరము విద్య, ఉత్తమ శిక్షాగ్రహణము అగ్నిహోత్రము మొ॥ యజ్ఞము నను్ఠించవలయునని శిష్యునకు గురువుపదేశించవలయునని చెప్పబడుచున్నది.

అపాం పేరురస్యాపో దేవీః స్వదన్తు స్వాత్తఞ్చిత్ సద్దేవహవిః। సం తే ప్రాణో వాతేన గచ్ఛతాꣳ సమఙ్గాని యజత్రైః సంయ్యజ్ఞపతి రాశిషా॥ ౬.౧౦॥

అపామ్, పేరుః, అసి, ఆపః, దేవీః, స్వదన్తు, స్వాత్తమ్, చిత్, సత్, దేవహవిరితి దేవహవిః, సమ్, తే, ప్రాణః వాతేన, గచ్ఛతామ్, అఙ్గాని, యజత్రైః, యజ్ఞపతిరితి యజ్ఞపతిః, ఆశిషే త్యాశిషా.

పదార్థః :-(అపామ్)జలానామ్(పేరుః)రక్షకః(అసి) (ఆపః)(దేవీః) శుద్ధా దివ్యసుఖప్రదాః (స్వదన్తు)(స్వాత్తమ్)స్వేన సమన్తాత్ గృహీతమ్(చిత్)అపి (సత్) (దేవహవిః)దేవేభ్యో హవిరివ (సమ్)(తే)తవ(ప్రాణః)(వాతేన)పవనేన సహ(గచ్ఛతామ్)(అఙ్గాని)శిర ఆదీని(యజత్రైః)యజ్ఞసాధకై ర్విద్వద్భిః సహ(యజ్ఞపతిః)యజ్ఞస్య పాలకః(ఆశిషా) అయం మన్త్రః శతం. ౩. ౬. ౬. ౯. వ్యాఖ్యాతః.

అన్వయః :- హే శిష్య! త్వమపాం పేరురసి. సంసారస్థాః ప్రాణిన స్త్వద్యజ్ఞశోధితా దేవీరాపశ్చిత్ స్వాత్తం ధర్మానుష్ఠాన స్వీకృతం దేవహవి రివ సంస్వదన్తు. మదాశిషా తవాంగాని యజత్రైః సహ గచ్ఛంతామ్, ప్రాణో వాతేన సంగచ్ఛతాం త్వం యజ్ఞపతి ర్భవ.

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యా యజ్ఞే ప్రాస్తా హుతయ స్తా ఆదిత్యముపతిష్ఠన్తే. ఆదిత్యాకర్షణశక్త్యా పృథివీజలాకర్షణేన వృష్టి ర్భవతి. తతోఽన్న మన్నాద్భూతానీతి పరంపరాసంబంధేన యజ్ఞశోధితా ఆపో హుతద్రవ్యం చ సర్వే జీవా భుఞ్జతే.

పదార్థము :- ఓ శిష్యా! నీవు(అపామ్) జలాది పదార్థములను(పేరుః) రక్షించువాడవు (అసి) అయి యున్నావు. సంసారస్థ జీవులు నీయజ్ఞముద్వారా శుద్ధమైనవియు (దేవీః)దివ్యసుఖమిచ్చునవియునగు(ఆపః)జలములను(చిత్)మరియు(స్వాత్తమ్)ధర్మయుక్త వ్యవహారములతో ప్రాప్తించిన పదార్థములను (దేవహవిః) విద్వాంసులు భోగించుమాదిరిగా(సంస్వదంతు)చక్కగా భోగించుదురుగాక!(ఆశిషా)నా ఆశీర్వాదము వలన(తే అంగాని)నీ శిరసాది అంగములు(యజత్రైః)యజ్ఞము చేయించువారితోపాటు (సమ్) చక్కగా నియుక్తములగుగాక! మరియు(ప్రాణః)ప్రాణము(వాతేన) పవిత్రవాయువుతోపాటు (సంగచ్ఛతామ్) చక్కగా రమణమొనరించును గాక! మరియు నీవు(యజ్ఞపతిః) విద్యాప్రచారరూప యజ్ఞమును పాలించువాడవగుదువుగాక !

భావార్థము :- ఇచ్చట వాచకలుప్తోపమాలంకారమున్నది. యజ్ఞములో వ్రేల్చబడిన ఆహుతులు సూర్యునియందుపస్థితములగుచున్నవి. అనగా సూర్యుని ఆకర్షణశక్తి

వలన పరమాణు రూపములై పదార్థములన్నియు భూమికిపైన, ఆకాశస్థములై యు న్నవి. ఆ పృథివిమీది జలములే పైకి ఆకర్షింపబడగా వర్షించుచున్నది. ఆ వర్షము వలన అన్నము, అన్నమువలన సకలజీవులకు సుఖము సమకూరుచున్నది. ఈ క్రమబద్ధమైన సంబంధముద్వారా యజ్ఞశోధిత జలమును, హోమమొనర్చబడిన ద్రవ్యమును సకలజీవులు అనుభవించుచున్నవి. [౨౧౮]

---

౨౧౯. ఘృతేనాక్తా విత్యస్య మేధాతిథి ఋషిః, వాతో దేవతా, భురిగార్చ్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః

అథ యజ్ఞకర్తృ కారయిత్రోః కర్తవ్యముపదిశ్యతే.

యజనమొనర్చువారియొక్కయు, యాజనమొనరించువారియొక్కయు కర్తవ్య కర్మలిందుపదేశించబడుచున్నవి.

ఘృతేనాక్తౌ పశూంస్త్రాయేథాం రేవతి యజమానే ప్రియం ధా ఆవిశ। ఉరోరన్తరిక్షాత్ సజూర్దేవేన వాతేనాస్య హవిషస్త్మనా యజ సమస్య తన్వా భవ వర్షో వర్షీయసి యజ్ఞే యజ్ఞపతిం ధాః స్వాహా దేవేభ్యో దేవేభ్యః స్వాహా॥౬.౧౧॥

ఘృతేన, అక్తౌ, పశూన్, త్రాయేథామ్, రేవతి, యజమానే, ప్రియమ్, ధాః, ఆ, విశ, ఉరోః, అన్తరిక్షాత్, సజూరితి సజూః, దేవేన, వాతేన, అస్య, హవిషః, త్మనా, యజ, సమ్, అస్య, తన్వా. భవ, వరో — ఇతి వర్షో, వర్షీయసి, యజ్ఞే,యజ్ఞపతి మితి యజ్ఞపతిమ్, ధాః, స్వాహా, దేవేభ్యః, దేవేభ్యః, స్వాహా.

పదార్థః :-(ఘృతేన)(అక్తౌ)ఘృతేనాసక్తచిత్తౌ యజ్ఞకర్తా యజ్ఞకారయితా చ(పశూన్)గవాదీన్ (త్రాయేథామ్)రక్షేతామ్(రేవతి)ప్రశస్తైశ్వర్యయుక్తే(యజమానే)యజ్ఞానుష్ఠాతరి(ప్రియమ్) ప్రసన్నతా సంపాది సుఖమ్(ధాః)దేహి. అత్ర లోడర్థే లుఙ్ అడభావశ్చ(ఆ)సమన్తాత్(విశ)(ఉరోః) బహోః (అన్తరిక్షాత్)(సజూః)మిత్రమివ(దేవేన)సర్వగతేన(వాతేన)వాయునా సహ(అస్య)(హవిషః)హోతవ్యస్య. కర్మణి షష్ఠీ(త్మనా)ఆత్మనా(యజ)సంగచ్ఛస్వ ఏకీభవ(సమ్)(అస్య)(తన్వా)(భవ)(వర్షో) యజ్ఞకర్మణా సర్వసుఖసేచకః(వర్షీయసి) సర్వసుఖమభివర్షతి. (యజ్ఞపతిమ్) యజ్ఞపాలకమ్(ధాః) దేహి(స్వాహా) సత్క్రియానుకూలామ్(దేవేభ్యః(దీవ్యన్తి ప్రకాశన్తే సత్కర్మానుష్ఠానేన యే తేభ్యో ధర్మిష్ఠేభ్యో విద్వద్భ్యః (దేవేభ్యః) శుభేభ్యో గుణేభ్యః (స్వాహా) సత్క్రియానురూపామ్. అయం మంత్రః శత. ౩.౬.౨.౫-౧౬. వ్యాఖ్యాతః.

అన్వయః :- హే యజ్ఞకర్తృ కారయితారౌ! ఘృతేనాక్తౌ ఘృతమనస్కౌ యువాం పశూన్ త్రాయేథామ్. త్వమేకైకో దేవేన వాతేన సజూ రురో రంతరిక్షాత్ప్రియం ప్రేమోత్పాదకం సుఖం రేవతి యజమానే ధా ఆవిశ చ తత్ స్వాంతవృత్త మాప్నుహి.అస్య హవిషస్త్మనా ఆత్మనా యజ.

అస్య తన్వా సంభవై కీభవ న ద్వైధ మాచర. హే వర్ష్ణో యజ్ఞకర్మణా సుఖసేచకం త్వం దేవేభ్యః స్వాహా, దేవేభ్యః స్వాహా, తద్యజ్ఞం దిదృక్షుభ్యః పునః పునరాగతేభ్యో విద్వద్భ్యః సత్కృత్ సత్క్రియ్యానురూపాం వాచముదీరయన్ వర్షీయసి యజ్ఞే యజ్ఞపతిం ధాః.

భావార్థః :- యజ్ఞార్థం ఘృతాది మభీప్సుభి ర్మనుష్యైః పశవో రక్షణీయా ఘృతాది సద్ద్రవ్యై ణాగ్ని హోత్రాది యజ్ఞాన్ సంపాద్యతై ర్జలవాయూ సంశోధ్య సర్వేషాం ప్రాణినా మభీష్టం సుఖం సంపాద్యమ్.

పదార్థము :-(ఘృతేన అక్తౌ) ఘృతప్రసక్తులారా! ఘృతమును అభిలషించువారును,[యజ్ఞకర్తా!]మరియు యజ్ఞము చేయించువారును నగు సజ్జనపురుషులారా! మీరిరువురు (పశూన్) గవాది పశువులను (త్రాయేథామ్) పాలించుడు. మీరొక్కరొక్కరే (దేవేన)సర్వగతమగు(వాతేన)పవనముతో[పాటులేక సమానముగా] (సజూః) సమాన ప్రీతినిజూపు మిత్రునివలె(ఉరోః)విస్తృతమగు(అంతరిక్షాత్) అంతరిక్షమునుండి ఉత్పన్నమైన(ప్రియమ్)ప్రియసుఖమును(రేవతి)ప్రశస్తైశ్వర్యయుక్తుడగు (యజమానే) యజ్ఞమొనరించు ధనికునందు(ధాః)స్థాపించుడు. మఱియు(ఆవిశ)అతని అభిప్రాయమును గ్రహించుడు.(అస్య హవిషః)మఱియు నీ హోమయోగ్య పదార్థములను(త్మనా) స్వయముగ నిష్పన్న మొనర్చిన వాని[వలెనే]తో సమానముగ(యజ) అగ్నియందు వ్రేల్చుడు. అనగా యజ్ఞమందలి యేక్రియను విరుద్ధముగా భావించకుడు. మఱియు (అస్య తన్వా) ఇతని శరీరముతో(సమ్ భవ) ఏకీభావమునుంచుడు. ఎన్నడు విరోధ[భావ]ముతో ద్వివిధముగా ఆచరణమొనర్చకుడు (వర్ష్ణో)యజ్ఞకర్మచే సకల సుఖముల సమకూర్చు నోమానవులారా! (దేవేభ్యఃస్వాహా)(దేవేభ్యఃస్వాహా)సత్కర్మానుష్ఠానములచే ప్రకాశితులును, ధర్మనిష్ఠులును, జ్ఞానులునునగు నే పురుషులు యజ్ఞదర్శనాభిలాషులై పదే పదే యజ్ఞమునకు విచ్చేయుచున్నారో,ఆ విద్వాంసులకై చక్కని సత్కృత్యాను రూపములగు వాణులను చ్చరించుచు యజ్ఞపతిని(వర్షీయసి)సకల సుఖముల వర్షింపజేయు యజ్ఞమునందు (ధాః) అభినియుక్తునిగ నొనర్చుడు.

భావార్థము :-యజ్ఞమునకై ఘృతాది పదార్థముల నభిలషించు మానవుడు గవాది పశువుల పాలించవలయును. ఘృతాది శ్రేష్ఠపదార్థములతో అగ్నిహోత్రము మొదలుకొని ఉత్తమోత్తమ యజ్ఞముల[నొనర్చి వాని]ద్వారా జలపవనములను శుద్ధమొనర్చి సకల ప్రాణులకు సుఖముత్పన్న మొనర్చవలయును. [౨౦౯]

౨౦. మాఽహిర్భూరిత్యస్య మేధాతిథి ఋషిః విద్వాంసో దేవతాః, భురిక్ ప్రజాపత్యానుష్టుప్ ఛన్దః, గాంధారః, స్వరః.

స విద్వాన్ కీదృగ్భవే దిత్యుపదిశ్యతే.

ఆ విద్వాంసు డెటులుండవలయునను విషయమిందుపదేశించబడినది.

మాఽహిర్భూ ర్మా పృదాకు ర్నమ స్తఽ ఆతానానర్వా ప్రేహి ఘృతస్య కుల్యా ఉప ఋతస్య పథ్యా అను॥ ॥౬.౧౨.॥

మా, అహిః, భూః, మా, పృదాకుః, నమః, తే, ఆతానేత్యాతాన, అనర్వా ప్ర, ఇహి, ఘృతస్య, కుల్యాః, ఉప, ఋతస్య, పథ్యాః, అను.

పదార్థః :-(మా)నిషేధే(అహి)సర్పవత్(భూః)భవేః. అత్ర లిఙర్థే లుఙ్(పృదాకుః)మూఢవదభిమానీ వ్యాఘవద్వా హింసకః(నమః) అన్నమ్. నమఇత్యన్ననామసు పఠితమ్ నిఘం. ౨. ౭. (తే)తుభ్యమ్(ఆతాన)సమంతాత్సుఖం తనితః(అనర్వా) అశ్వహీనః. అర్వేత్యశ్వనామసు పఠితమ్. నిఘం. ౧.౧౪,(ప్ర)ప్రకృష్టార్థే(ఇహి)గచ్ఛ(ఘృతస్య)ఉదకస్య(కుల్యాః)ఘృతధారాః(ఉప) (ఋతస్య)సత్యస్య(పథ్యాః)వీథీః(అను)అయమ్మన్త్రః శత. ౩.౬,౨.౧౩, వ్యాఖ్యాతః.

అన్వయః :- హే ఆతాన! త్వం అహిర్మాభూః, పృదాకుర్మాభూస్తే తుభ్యం నమోఽస్తు. సర్వత్ర త్వత్సుఖాయాన్నాది పదార్థః పురత ఏవ ప్రవర్తత ఇతి భావః. అనర్వా ఘృతస్య కుల్యాః ఇవర్తస్య పథ్యా ప్రోపైహి.

భావార్థః :- కేనాపి మనుష్యేణ ధర్మమార్గే కుటిలమార్గగామి సర్పాదివత్కుటిలాచరణేన న భవితవ్యం, కింతు సర్వదా సరలభావేనైవ భవితవ్యమ్.

పదార్థము :-(ఆతాన) సుఖమును బాగుగా విస్తరింపజేయునో విద్వాంసుడా! నీవు(అహిః)సర్పమువలె కుటిల మార్గగామివి,(మా)కాకుండుము. మరియు(మా,భూః, పృదాకుః)మూర్ఖజన సదృశునిగ అభిమానవంతుడువుగను లేక వ్యాఘ్రసదృశముగ హింసించువాడవుగను కాకుండుము.(తే నమః)సర్వత్ర నీసుఖమునకై అన్నాది పదార్థములు పూర్వమునుండియే ప్రవృత్తములై యున్నవి. మఱియు(అనర్వా) అశ్వాది యానములు లేని నిరాశ్రయ పురుషుడెటుల(ఘృతస్య)జలముల(కుల్యాః) పెద్ద ధారలను పొందునో అటులనే(ఋతస్య)సత్యముయొక్క(పథ్యాః)మార్గములను [ప్ర ఉప ఇహి] పొందుము.

భావార్థము :- ఏ మానవుడు ధర్మమార్గమున కుటిలగామి కాకూడదు. సర్పాదులవలె కుటిలాచరణమొనరించకూడదు. మఱేమనిన సతతము సరళ భావముతోనే మెలగవలయును. [౨౨౦]

౨౨౧. దేవీరాప ఇత్యస్య మేధాతిథి ఋషిః, ఆపో దేవతాః, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః. గాంధారః, స్వరః.

**అథ వటుభి ర్బ్రహ్మచారిణీభిశ్చ గురుపత్న్యః కథం సమ్మాననీయా ఇత్యుపదిశ్యతే.**

బాలకబ్రహ్మచారులు, బ్రహ్మచారిణీకన్యలు గురుపత్నులనెటుల సమ్మానించవలయునో యిందుపదేశించబడినది.

దేవీరాపః శుద్ధా వోఢ్వꣳ సుపరివిష్టా దేవేషు సుపరివిష్టా వయ మ్పరివే ష్టారో భూయాస్మ॥ ॥౬.౧౩.॥

దేవీః, ఆపః, శుద్ధాః, వోఢ్వమ్, సుపరివిష్టాః ఇతి సుపరివిష్టా దేవేషు, సుపరి విష్టా +ఇతి సుపరివిష్టా, వయమ్, పరివేష్టార+ఇతిపరివేష్టారః,భూయాస్మ.

పదార్థః :-(దేవీః)సద్విద్యాప్రకాశవత్యః(ఆపః)ఆప్నువంతి సద్గుణాన్ యాస్తాః(శుద్ధాః)సత్కర్మానుష్ఠానపూతాః(వోఢ్వమ్)స్వయంవర వివాహ విధిం ప్రాప్నుత. అత్ర వహ ప్రాపణ ఇత్యస్మాల్లోటి మధ్యమ బహువచనే బహులం ఛందసీతి శపో లుకి కృతే, సహి వహోరోదవర్ణస్య, అ. ౬.౩.౧౧౨. ఇత్యనేనోకారః. (సుపరిష్టాః) తత్తత్సే వాముమ్మఖ్య ఏవ. అత్ర వర్తమానే లోట్. (దేవేషు)సద్విద్యాది దివ్యగుణేషు విద్వత్సు(సుపరివిష్టాః)తథా భూతా ఏవ (వయమ్) (పరివేష్టారః) పరితో వ్యాప్తాః(భూయాస్మ).

అన్వయః :- హే కుమార్యా యథాపః సద్గుణేషు వ్యాప్తా శుద్ధా దేవీః విదుష్యః సత్ స్త్రియో దేవేషు సద్విద్యాది దివ్యగుణేషు విద్వత్సు స్వపతిషు సుపరివిష్టాః కృతబ్రహ్మచర్యాః స్వసమాన్వరాన్ స్వీకృతవత్యః యథా చ తే విద్వాంస స్తాః విదుషీః ప్రాప్తా స్తథా యూయం స్వీభావేనాస్మాꣳ ప్రాప్నుతైం వయమపి పరివేష్టారో భూయాస్మ.

భావార్థః :— అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా విదుష్యో విదుషా స్త్రియః పాతివ్రత్య ధర్మతత్పరా భవన్తి. తథా బ్రహ్మచారిణ్యః కన్యాస్తద్గుణ స్వభావా భవేయు ర్బ్రహ్మచారిణ్యో గురుజన స్వభావాః స్యుః. యతః. సుశిక్షయా స్త్రీపుత్రాది రక్షణశీలా భవేయురితి.

పదార్థము :- ఓ కుమారీమణులారా! (ఆపః)శ్రేష్ఠగుణములందు రమించువారును, (శుద్ధాః) సత్కర్మానుష్ఠానముచే పవిత్రులును, (దేవీః) విద్యాప్రకాశవతులునునగు స్త్రీలు,(దేవేషు)శ్రేష్ఠవిద్వాంసులగు పతుల నిమిత్తము,(సుపరివిష్ఠాః)వారి సమ్ముఖమున సేవ యొనర్చుటకు ప్రవృత్తురాండ్రై;[కృతబ్రహ్మచర్యరాండ్రై]స్వసదృశపతులను (వోఢుమ్) పొందుచున్నారో; మఱియు విద్వాంసులగు నా పతులును ఆ స్త్రీలను పొందుచున్నారో, అటులనే మీరును[స్వీభావయుతలై మమ్ముపొందు వారుగ]కండు. మేమును (పరివేష్టారః)ఆ కర్మలకు యోగ్యులుగ(భూయాస్మ)అగుదుముగాక!

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారమున్నది. విదుషీ మణులనగా విద్వాంసుల స్త్రీలు, పతివ్రత ధర్మమునందెటుల తత్పరురాండ్రై యుందురో అటులనే బ్రహ్మచారిణులైన కన్యలును వారిగుణ స్వభావములుగల వారగుదురుగాక! బ్రహ్మచారులును గురుజనులచే పొందిన శిక్షచే [గురుజన స్వభావయుక్తులై స్త్రీ పురుష [పుత్రా]దులను సంరక్షించుటయందు తత్పరులగుదురుగాక! [౨౨౧]

౨౨౨. వాచం త ఇత్యస్య మేధాతిథి ర్ఋషిః, విద్వాంసో దేవతాః, భురిగార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

**అథ కథం తా గురుపత్న్యో గురవశ్చ యథాయోగ్యశిక్షయా స్వస్వాన్తేవాసినః సద్గుణేషు ప్రకాశయన్తీత్యుపదిశ్యతే.**

ఆ గురుపత్నులు, గురుజనులు యథాయోగ్యశిక్షగలవి తమ యంతేవాసులను సద్గుణములచే నెటుల ప్రకాశిత మొనర్తురో యిందు చెప్పబడినది.

వాచం తే శుంధామి ప్రాణం తే శుంధామి చక్షుస్తే శున్ధామి శ్రోత్రన్తే శున్ధామి నాభిన్తే శున్ధామి మేఢ్రం తే శున్ధామి పాయున్తే శున్ధామి చరిత్రాఀస్తే శుంధామి

వాచమ్, తే, శుంధామి, ప్రాణమ్, తే, శుంధామి, చక్షుః, తే, శుంధామి, శ్రోత్రమ్, తే, శుంధామి, నాభిమ్, తే, శుంధామి, మేఢ్రమ్, తే, శున్ధామి, పాయుమ్, తే, శున్ధామి, చరిత్రాన్, తే, శున్ధామి. ॥౬.౧౪.॥

పదార్థః :-(వాచమ్)వక్త్యనయా తాం వాణీమ్.(తే)తవ(శుంధామి)నిర్మలీకరోమి(ప్రాణమ్) ప్రాణితి యేన తం జీవనహేతుమ్(తే)(శుంధామి)(చక్షుః) చష్టేఽనేన తన్నేత్రమ్ (తే) (శుంధామి) (శ్రోత్రమ్)శృణోతి యేన తత్(తే)(శుంధామి)(నాభిమ్)నహ్యతే బధ్యతే యయా తామ్(తే)(శుంధామి)(మేఢ్రమ్)మేహత్యనేన తదుపస్థేన్ద్రియమ్(తే)(శుంధామి)(పాయుమ్) పాత్యనేన తం గుహ్యేన్ద్రియమ్(తే)(శుంధామి)(చరిత్రాన్)వ్యవహారాన్(తే)(శుంధామి)అయమ్మంత్రః శత.౩.౬.౨.౬. వ్యాఖ్యాతః.

అన్వయః :- హే శిష్య! వివిధశిక్షాభి స్తేఽహం వాచం శుంధామి, తే ప్రాణం శుంధామి. తే చక్షుః శుంధామి. తే శ్రోత్రం శుంధామి. తే నాభిం శుంధామి. తే మేఢ్రం శుంధామి. తే పాయుం శుంధామి. తే చరిత్రాన్ శుంధామి.

భావార్థః :- గురుభి ర్గురుపత్నీభిశ్చ * వేదోపవేదవేదాంగోపాఙ్గశిక్షయా దేహేంద్రియాంతఃకరణాత్మనఃశుద్ధి శరీరపుష్టి ప్రాణసంతుష్టీః ప్రదాయ సర్వే కుమారాః సర్వాః కన్యాశ్చ సద్గుణేషు ప్రవర్తయితవ్యా ఇతి.

పదార్థము :- ఓ శిష్యుడా! నేను వివిధ శిక్షలద్వారా (తే)నీయొక్క (వాచమ్) వాణిని(శుంధామి)శుద్ధముగ, సద్ధర్మానుకూలముగ నొనర్చుచున్నాను. (తే) నీయొక్క (చక్షుః)చూచు నేత్రములను(శుంధామి)పరిశుద్ధ పఱచుచున్నాను.(తే నాభిమ్)నాడ్యాదులు బద్ధములై యున్న నీ నాభిని(శుంధామి) పవిత్ర మొనర్చుచున్నాను. (తే మేఢ్రమ్) మూత్రోత్సర్గాదులొనర్చు నీ లింగమును(శుంధామి)పవిత్రపఱచుచున్నాను.(తే పాయుమ్) రక్షణ మొనర్చు నీ గుదేంద్రియమును(శుంధామి)పవిత్ర మొనర్చుచున్నాను.(చరిత్రా

ఎటులశీఘ్రముగా విద్వాంసుడగునో అటుల ప్రయత్న మొనర్చుము. ఓ ప్రియురాలా! ఈ కన్య ఏవిధము అతిశీఘ్రముగా విదుషీమతల్లియగునో అటువంటిపని చేయుము. [౨౩]

౨౪. రక్షసాం భాగ ఇత్యస్య మేధాతిథి ర్ఋషిః, ద్యావాపృథివ్యౌ దేవతే,
బ్రాహ్మ్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.
అథ శిష్యవర్గేషు యథాయోగ్యోపదేశకరణమాహ

శిష్యవర్గము నందలి ప్రతివానికి యథాయోగ్యముగ నుపదేశించవలయునని చెప్పబడినది.

రక్షసాం భాగోఽసి నిరస్తꣳ రక్ష ఇదమహꣳ రక్షోఽభితిష్ఠామీద మహꣳ రక్షోఽవబాధఽఇదమహꣳ రక్షోఽధమం తమో నయామి। ఘృతేన ద్యావాపృథివీ ప్రోర్ణువాథాం వాయో వేః స్తోకానా మగ్ని రాజ్యస్య వేతు స్వాహా స్వాహా కృత ఽఊర్ధ్వనభస మ్మారుత ఙ్గచ్ఛతమ్॥ ॥౬.౧౬॥

రక్షసామ్, భాగః, అసి, నిరస్తమితి నిః+అస్తమ్, రక్షః, ఇదమ్, అహమ్, రక్షః, అభి, తిష్ఠామి, ఇదమ్, అహమ్, రక్షః, అవబాధే, ఇదమ్, అహమ్, రక్షః, అధమమ్, తమః, నయామి, ఘృతేన, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, ప్ర, ఊర్ణువాథామ్, వాయో+ఇతి వాయో, వేః, స్తోకానామ్, అగ్నిః, ఆజ్యస్య, వేతు, స్వాహా, స్వాహా కృత+ఇతి స్వాహాకృతే, ఊర్ధ్వనభసమిత్యూర్ధ్వనభసమ్, మారుతమ్, గచ్ఛతమ్.

పదార్థః :-(రక్షసామ్)రక్షంతి పరార్థహననేన స్వార్థమితి రక్షాంసి తేషామ్(భాగః)సేవనీయః (అసి)(నిరస్తమ్)నిః సృతమ్(రక్షః)సర్వతః)స్వార్థరక్షకః పరార్థహంతా(ఇదమ్)(అహమ్)(రక్షః) (అభి)సమ్ముఖే(తిష్ఠామి)(ఇదమ్)(అహమ్) (రక్షః) రక్షతి సర్వతః స్వార్థనిమిత్తీభూతం కర్మ (అవ) అర్వాగర్థే(బాధే) నాశయామి (ఇదమ్) (అహమ్) (రక్షః) (అధమమ్) నీచం తమోఽన్ధకారమ్ (నయామి)ప్రాపయామి(ఘృతేన)జలేన (ద్యావాపృథివీ)భూమిప్రకాశౌ(ప్ర)ప్రకృష్టార్థే (ఊర్ణువాథామ్) ఆచ్ఛాదయతామ్(వాయో) వాతి జానాతి సూచయతి సదసత్పదార్థానితి వా వాయుస్తత్సంబుద్ధౌ(వేః) విద్ధి. అత్ర లోడర్థే లఙ్. (స్తోకానామ్) స్వల్పానామ్. శేషవివక్షాతః కర్మణి షష్ఠీ (అగ్నిః) సర్వ విద్యాప్రాప్తోవిద్వాన్(ఆజ్యస్య)స్నేహద్రవ్యస్య(స్వాహాకృతే)సత్యవాచాముపగతే వ్యవహారే(ఊర్ధ్వ నభసమ్) ఊర్ధ్వం నభో జలం యస్మాత్తమ్. (మారుతమ్) (గచ్ఛతమ్).

అన్వయః:- హే దుష్టకర్మకారిన్! త్వం రక్షసాం భోగోఽస్యతో రక్షో నిరస్తం భవ. అహం ఇదం రక్షోఽభితిష్ఠామి తిరస్కారణాయ తత్సన్ముఖముపవిశామి. న కేవల మభితిష్ఠామి కింతు అహమిదం రక్షో దుష్టస్వభావిన మవబాధేఽర్వాచీనో యథా స్యాత్తథా హన్మి,యతో న పునః సన్ముఖో భూయాదితి భావః. అహమిదం రక్షోఽధమం తమో నయామి, దుఃసహ దుఃఖం ప్రాపయామి చ. హేవాయో! గుణగ్రాహక! సదసద్వివేచనశీల! శిష్య! త్వం స్తోకానాం స్తోకాన్ సూక్ష్మవ్యవహారాన్ వేః విద్ధి. త్వద్యజ్ఞశోధితేన ఘృతేన ద్యావాపృథివీ ప్రోర్ణువాథామ్ ఆచ్ఛాదయేతామ్. అగ్నిః సమస్త విద్యావన్నో విద్వాంస్తవాజ్యస్య స్నేహద్రవ్యం స్వాహా వేత్తు జానాతు. తథా స్వాహాకృతే పూర్వోక్తే ద్యావాపృథివ్యౌ ఊర్ధ్వనభసం త్వద్యజ్ఞశోధితజల మూర్ధ్వప్రాపకం మారుతం గచ్ఛత ప్రాప్నుతమ్.

భావార్థః :- బుద్ధిమన్తః సదసద్వివేచకా విద్వాంసః శిష్యేషు యథాయోగ్యశిక్షణ మనువిదధతి యజ్ఞకర్మణా జలవాయుశుద్ధ్యా వృష్టిర్భవతి. వృష్ట్యైవ సర్వప్రాణిభ్యః సుఖం సంపద్యతే.

పదార్థము :- దుష్టకర్మలొనరించు ఓ జనుడా ! నీవు (రక్షసామ్) పదార్థముల నాశనమొనరించి స్వార్థమును సాధించుకొను దుష్టులకు(భాగః అసి)[సేవనీయుడవగు] భాగస్తుడవై యున్నావు. కావున(రక్షః)రాక్షస స్వభావుడవైన నీవు (నిరస్తమ్) వెడలిపొమ్ము (అహమ్)నేను(ఇదమ్ రక్షః)ఇటువంటి స్వార్థసాధకునిఁ(అభితిష్ఠామి)తిరస్కరించుటకు సంసిద్ధుడనగు చున్నాను. కేవలము ఎదుర్కొనుటయేగాక(అహమ్)నేను (ఇదమ్ రక్షః)ఇటువంటి దుష్టజనుని (అవబాధే) మరల నతడు ముఖము కనపఱచకుండునటుల అత్యంత తిరస్కారభావముతో తాడన మొనరించెదను. (అహమ్) నేను(ఇదమ్ రక్షః) ఇటువంటి దుష్టజనునకు(అధమమ్)దుస్సహ దుఃఖమును (నయామి)కలిగించుచున్నాను.

ఇక శ్రేష్ఠగుణగ్రాహియగు శిష్యునకుపదేశము—ఓ వాయువా ! గుణగ్రాహకుడవును, సదసద్వ్యవహారములందు వివేచనాశీలుడవునగు నోశిష్యా! నీవు (స్తోకానామ్) సూక్ష్మాతిసూక్ష్మ వ్యవహారములను (వేః) ఎఱుగుము. మరియు నీయజ్ఞశోధితమైన జలముచే(ద్యావాపృథివీ)సూర్యుడు, భూమి(ప్రోర్ణువాథామ్) చక్కగా నాచ్ఛాదితములగునుగాక ! (అగ్నిః) సమస్త విద్యాయుక్తులైన విద్వాంసులు ఘృతాది పదార్థములతో (స్వాహా)చక్కగా నీచే హోమమొనర్చబడిన దానిని(వేతు)ఎరుగుదురుగాక ! మరియు (స్వాహాకృతే)హవనమొనర్చబడిన స్నిగ్ధద్రవ్యమును పొందిన పూర్వోక్తములైన ఏసూర్యభూములున్నవో అవి (ఊర్ధ్వనభసమ్) నీయజ్ఞముచే శుద్ధమైన జలమును పైకిచేర్పించు (మారుతమ్)పవనమును(గచ్ఛతమ్) పొందుగాక !

భావార్థము:- శ్రేష్ఠాశ్రేష్ఠముల వివేకము కలిగియున్న బుద్ధిమంతులగు విద్వాంసులు తమ శిష్యులకు యథాయోగ్యముగ శిక్షావిధానమొసగుచున్నారు. యజ్ఞకర్మతో జలవాయువులశుద్ధి, వానిశుద్ధిచే వర్షము, వర్షముచే సకల ప్రాణులకు సుఖము లభించుచున్నది. [౨-౧౬]

౨౨. ఇదమాప ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆపో దేవతాః, నిచృద్బ్రాహ్మీ నుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

శుద్ధేన జలేన కిం భావనీయ మిత్యుపదిశ్యతే.

నిర్దుష్టజలముచే నేమి సంభావన మొనర్చ వచ్చునో యిందు విశదీకరించ బడుచున్నది.

ఇదమాపః ప్రవహతావద్యఞ్చ మలఞ్చ యత్। యచ్చాభిదుద్రోహానృతం యచ్చ శేపే౭అభీరుణమ్। ఆపో మా తస్మాదేనసః పవమానశ్చ ముఞ్చతు॥౬.౧౭॥

ఇదమ్, ఆపః, ప్ర, వహత, అవద్యమ్, చ, మలమ్, చ, యత్, యత్, చ, అభిదుద్రోహేత్యభి దుద్రోహ, అనృతమ్, యత్, చ, శేపే, అభీరుణమ్, ఆపః, మా, తస్మాత్, ఏనసః, పవమానః, చ, ముఞ్చతు.

పదార్థః :-(ఇదమ్)వక్ష్యమాణమ్(ఆపః)ఆప్నువంతీత్యాపః(ప్ర)(వహత)అత్ర లడర్థే లోట్(అవద్యమ్)నింద్యమ్(చ)వికారినముచ్చయే(మలమ్)అశుద్ధికరమ్(యత్)(చ)ప్రకృతి విరుద్ధగ్రహణే(యత్)(చ)లోకవిక్రుష్టసముచ్చయే(అభిదుద్రోహ)యథా౭భిద్రుహ్యాతి తథా(అనృతమ్)అసత్యమ్(యత్)(చ)పరుషవచః సముచ్చయే(శేపే)ఆక్రుశ్యామి(అభీరుణమ్)నిర్భయమ్(ఆపః)(మా) మామ్(తస్మాత్)(ఏనసః)ధర్మవిరుద్ధాచరణాత్(పవమానః)పవిత్రీకరో వ్యవహారః (చ) శుద్ధోపదేశ సముచ్చయే(ముఞ్చతు)పృథక్ కరోతు.

అన్వయః :- ఆపః సర్వవిద్యావ్యాపినో విపశ్చితో యూయం యథాపః శుద్ధికరా స్తథా మమ యదవద్యం నింద్యం కర్మ.యచ్చ మలం అవిద్యారూపం, తదిదం ప్రవహత, అపనయత చ పునః యదహ మనృతం కం చ దుద్రోహ,చ యత్ అభీరుణం నిరపరాధినం పురుషం శేపే,తస్మాత్ పూర్వోక్తాదేనసః మా మాం పృథక్ రక్షతు. యథా పవమానో మాలిన్యాన్మాం సద్యో దూరీకరోతి తథా ౭న్యానపి ముంచతు పృథక్ కరోతు.

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః ఉపమాలంకారశ్చ. విద్వాన్ జలమివ సాంసారిక పదార్థానాం శోధకో భూత్వా ధర్మ్యం కర్మాచరేత్. మనుష్యై రీశ్వరప్రార్థనయా దుష్టాచారాత్ పృథక్ భూత్వా నిర్మలేషు విద్యాదిగ్రహణకర్మసు సదా ప్రవర్తితవ్యమితి.

పదార్థము:-(ఆపః)సర్వ విద్యావ్యాపకులగు నో విద్వాంసులారా! మీ రెటుల (ఆపః)జలమును శుద్ధ మొనరించుచున్నారో అటులనే నాయొక్క (యత్ అవద్యమ్) అకథనీయ నింద్య కర్మయేది యున్నదో, (చ) మరియు ఏ వికారమున్నదో మరియు (యత్ మలమ్)అవిద్యారూపమగు నే మలమున్నదో(ఇదమ్)ఆ దీనిని(ప్రవహత)కడిగివేయుడు. దూర మొనర్చుడు.(చ)మరియు(యత్)నేను(అనృతమ్)అబద్ధముగా నిష్కారణముగ ఎవనికైనా(దుద్రోహ)ద్రోహ మొనరించుచున్నట్లయితేను,(చ)మరియు(యత్ అభీరుణమ్)నిర్భయుడు,నిరపరాధియునగు పురుషుని(శేపే)రెచ్చగొట్టుచు, దూషించుచున్నట్లైతేను(తస్మాత్)పైన జెప్పబడ్డ(ఏనసః)ఈపాపములనుండి(మా) నన్ను వేరుపఱచుము

(చ)మఱియు (పవమానః)పవిత్ర వ్యవహారము(మా)నన్ను పాపవ్యవహారమునుండి వేరు పఱచుచున్నటులనే(చ)అన్యమనుష్యులనుకూడ వేరుపఱచుగాక !

భావార్థము :- ఎటుల జలములు సాంసారిక పదార్థముల శుద్ధికి మూలకారణములో, అటులనే విద్వాంసులు సంస్కరణములకు మూలకారకులై యున్నారు. కావున వారు సుకర్మల నొనరించవలయును. మానవులు ఈశ్వరోపాసన, విద్వాంసుల సాంగత్యముచే దుష్టాచరణములవీడి సతతము ధర్మమునందు ప్రవృత్తులగుదురుగాక! [౨-౨౫]

---

౨-౨౬. సంత ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, అగ్ని ర్దేవతా, ప్రాజాపత్యానుష్టుప్ ఛందః, గాంధారః స్వరః, రేడసీత్యస్య దైవీపంక్తి శ్ఛందః, పంచమః స్వరః.

అథ రణే యోద్ధా కీదృగ్భవేదిత్యుపదిశ్యతే.

రణమందు యుద్ధమొనర్చు శిష్యు డెటు లుండవలయునో ఉపదేశించబడుచున్నది.

స న్తే మనో మనసా సంప్రాణః ప్రాణేన గచ్ఛతామ్। రేడస్యగ్నిష్ట్వా శ్రీణాత్వాపస్త్వా సమరిణ న్వాతస్య త్వా ధ్రాజ్యై పూష్ణో రంహ్యా ఉష్మణో వ్యథిషత్ ప్రయుత న్ద్వేషః॥ ॥౬.౧౮॥

సమ్, తే, మనః, మనసా, సమ్, ప్రాణః, ప్రాణేన, గచ్ఛతామ్, రేట్, అసి, అగ్నిః, త్వా, శ్రీణాతు, ఆపః, త్వా, సమ్, అరిణన్, వాతస్య, త్వా, ధ్రాజ్యై, పూష్ణః, రంహ్యై. ఊష్మణః, వ్యథిషత్, ప్రయుతమితి ప్రయుతమ్, ద్వేషః.

పదార్థః:-(సమ్)(తే)తవ(మనః)అంతఃకరణమ్(మనసా)విజ్ఞానేన(సమ్)(ప్రాణః)(ప్రాణేన) బలేన(గచ్ఛతామ్)(రేట్)శత్రుహింసకః. అత్ర రిషతే ర్హింసార్థాత్ కర్తరి విచ్(అగ్నిః)యుద్ధజన్య క్రోధాగ్నిః(త్వా)త్వామ్(శ్రీణాతు)పరిపచతు(త్వా)త్వామ్(ఆపః)జలాని(సమ్)(అరిణన్)ప్రాప్నువంతు రిణాతీతి గతికర్మసు పఠితమ్ నిఘం. ౨.౧౪.(వాతస్య)వాయోః(ధ్రాజ్యై)గత్యై. అత్ర గత్యర్థాత్ ధ్రజధాతోః ఇఞ్ వపాదిభ్య ఇతీఞ్ ప్రత్యయః(పూష్ణః)పోషకరస్యాదిత్యస్య(రంహ్యై)గత్యై(ఊష్మణః)ఆతపాత్(వ్యథిషత్)వ్యథతే(ప్రయుతమ్)వీతత్సంఖ్యాకమ్.(ద్వేషః)ద్వేష్టి యేన సః. అయమ్మన్త్రః శత. ౩.౬.౪.౯-౩౦. వ్యాఖ్యాతః.

అన్వయః :- హే యోద్ధః! సంగ్రామే తే మనో మనసా ప్రాణః ప్రాణేన చ సంగచ్ఛతామ్. హే వీర! త్వం రేడసి. త్వా త్వామగ్ని ర్యుద్ధజన్యక్రోధాగ్ని శ్శ్రీణాతు. త్వం ప్రయుతం శత్రుసైన్యం ప్రాప్య తజ్జన్యాదూష్మణో ద్వేషో మా వ్యథిషత్. త్వాం వాతస్య ధ్రాజ్యై వాతస్య గతిభి ర్యుద్ధకర్మణి గత్యై యద్వా పూష్ణో రంహ్యై సూర్యస్య గతిరివ, యుద్ధభూమిషు గత్యై యదార్థతయా యుద్ధకర్మణి ప్రవృత్త్యై ఆపః సమరిణన్.

భావార్థః :. మనుష్యైః సంగ్రామే మన్య సమాధాయ స్వబలవర్ధకాన్న పాన శస్త్రాది పదార్థాన్ సంపాద్య శత్రూన్ నిహత్య సంగ్రామో విజేతవ్య ఇతి.

పదార్థము :- ఓ యుద్ధశీలుడా! శూరవీరుడా! సంగ్రామమునందు (తే మనః) నీ మనస్సు(మనసా)విద్యాబలముతోను, మరియు(ప్రాణః)ప్రాణము(ప్రాణేన)ప్రాణముతో ను(సమ్ గచ్ఛతామ్)సంగతములగు గాక! ఓ వీరా! నీవు(రేట్ అసి)శత్రుసంహారకుడవు. (త్వా)నిన్ను(అగ్నిః)యుద్ధజనిత క్రోధాగ్ని (శ్రీణాతు) చక్కగా పచనమొనరించును గాక! నీవు (ప్రయుతమ్) కోట్లకొలదిగానున్న శత్రువుల సేనను ఎదుర్కొనినప్పుడు, తజ్జన్యమగు(ఊష్మణః)వేడియొక్క(ద్వేషః)ద్వేషము(వ్యథిషత్)నిన్నత్యంత పీడాయుక్తుని గా నొనర్చకుండునుగాక! దేనివలననైతే (వాతస్య, ధ్రాజ్యై) పవనగతితో తుల్యమగు [యుద్ధ]గతి కొఱకు లేక(పూష్ణః రంహ్యై)పుష్టి కారకుడగు సూర్యుని వేగముతో తుల్యమగు వేగముకొఱకు అనగా యదార్థత్వముతో యుద్ధమొనర్చుటకు ప్రవృత్తుడవగుటకై (ఆపః)మంచి జలము లు(సమ్)(అరిణన్)చక్కగా ప్రాప్తించునుగాక!

భావార్థము :- మనుష్యులు తమ బలమును అభివృద్ధిపరచు నన్నజలములను, శస్త్రాస్త్రాది పదార్థములను సంగ్రహించుకొని శత్రువులను సంహరించి సంగ్రామమున జయము పొందవలయును. [౨౨౬]

౨౨౭. ఘృతం ఘృతపావాన ఇత్యస్య దీర్ఘతమో ఋషిః, విశ్వదేవా దేవతాః, బ్రాహ్మ్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

**పునస్తత్ర కిం భవితు మర్హతీత్యుపదిశ్యతే.**

మరల యుద్ధకర్మము నందేమి కావలయునో యిందు చెప్పబడినది.

ఘృతఙ్ఘృతపావానః పిబత వసాం వసాపావానః పిబతాన్తరిక్షస్య హవిరసి స్వాహా। దిశః ప్రదిశ ఆదిశో విదిశ ఉద్దిశో దిగ్భ్యః స్వాహా॥ ॥౬.౧౯॥

ఘృతమ్, ఘృతపావాన ఇతి ఘృతపావానః, పిబత, వసామ్, వసాపావాన ఇతి వసాపావానః, పిబత, అన్తరిక్షస్య, హవిః, అసి, స్వాహా దిశః, ప్రదిశ ఇతి ప్రదిశః, ఆ దిశ ఇత్యాదిశః, విదిశ ఇతి విదిశః, ఉద్దిశ ఇత్యుత్ దిశః, దిగ్భ్య ఇతి దిగ్భ్యః, స్వాహా.

పదార్థః :-(ఘృతమ్)ఉదకం ఘృతమిత్యుదకనామసు పఠితమ్ నిఘం. ౧.౧౨.(ఘృతపావానః)ఉదకపా వీరాః(పిబత)(వసామ్)వీరరసనీతిమ్(వసాపావానః)వసాం నివాసం పాంతి తే(పిబత) (అంతరిక్షస్య) ఆకాశస్య (హవిః) ఆదీయత ఇతి. (అసి) (స్వాహా) యుద్ధానుకూలాం శోభనాం వాచమ్ (దిశః) పూర్వాద్యాః (ప్రదిశః) అభ్యంతరదిశః(ఆదిశః)అభిముఖ్యా దిశః(విదిశః) విరుద్ధ దిశః (ఉద్దిశః) యా ఉద్దిశ్యంతే తాః (దిగ్భ్యః)పూర్వప్రతిపాదితాభ్యః సర్వాభ్యః(స్వాహా) తత్తత్ స్థానానుకూలం శోభనాం వాచమ్. అయమ్మన్త్రః శత ౩. ౬. ౪. ౩౨-౩౬. వ్యాఖ్యాతః.

అన్వయః :- హే ఘృతపావానోవీరా ! యూయం ఘృతం పిబత, హే వసాపావానో ! యూయం వసాం పిబత. హే సేనాధ్యక్ష ! చక్రవ్యూహాదిసేనారచక ! త్వం ప్రతివీరమన్తరిక్షస్య హవి రసీతి. స్వాహా శోభనయా వాచా సర్వాన్,వీరాన్, యా దిశః, ప్రదిశ, ఆదిశో,విదిశ,ఉద్దిశశ్చ సన్తి, తాభ్యః సర్వాభ్యో దిగ్భ్యః సర్వాః సేనా విభజ్య శత్రూన్ విజయధ్వమ్.

భావార్థః :- సేనాధ్యక్షేణా ముచితమస్తి స్వసేనాస్థాన్ వీరాన్ శరీరబలయుక్తాన్ యుద్ధవిద్యా సుశిక్షితాన్ సంపాద్య యుద్ధే సర్వాసు దిక్షు యథాయోగ్యాన్ స్వసేనాభాగాన్ సంస్థాప్య సర్వతః శత్రూనావృత్య విజిత్య చ న్యాయేన ప్రజాం పాలయేయురితి.

పదార్థము:-(ఘృతపావానః)జలమును పానమొనరించు నో వీర పురుషులారా! మీరు(ఘృతమ్)అమృతాత్మకములగు జలములను(పిబత)త్రాగుడు.(వసాపావానః)నీతిని పాలించు నోవీరులారా!మీరు(వసామ్)శత్రువులను స్తంభింపజేయు వీరరసవాణిని(పిబత) సేవించుడు. ఓ సేనాధ్యక్షా! చక్రవ్యూహాది సేనావిధానకర్తా! నీవు ప్రతి[శత్రు)వీరునకు (అంతరిక్షస్య)ఆకాశముయొక్క(హవిః)అపుదలవు. అనగా యుద్ధములో ననేకులమధ్య శత్రుసేనలకు అడ్డుగోడవై(అసి)ఉన్నావు.(స్వాహా)ఆశోభనవాణిచే(దిశః)పూర్వపశ్చిమో త్తర దక్షిణ దిశలకు(ప్రదిశః) ఆగ్నేయ నైరృతి వాయవ్యేశాన్యాద్యుపదిశలకు (ఆదిశః) ఎదురు బొదురు, వెనుక ముందువైపులకు,(విదిశా) వెనుకటి దిశకు, మఱియు (ఉద్దిశః) శత్రులక్షితదిశలకు (దిగ్భ్యః) ఇటుల సకల దిక్కులకు యథాయోగ్యముగ వీరుల పంచి శత్రువుల జయించుము.

భావార్థము :- సేనాధ్యక్షులొనర్చదగిన కార్యము:- తమతమ సేనలందలి వీరు లను అత్యంత పుష్టులుగా నొనర్చి యుద్ధసమయమున చక్రవ్యూహము, శ్యేనవ్యూహ ము, శకటవ్యూహము మొదలగు వ్యూహ రచనాది యుద్ధకర్మలచే సకల దిశలందు స్వసేనా భాగములను నిలబెట్టి సకలవిధముల శత్రువుల నాక్రమించి-దాడిచేసి-ముట్ట డించి, జయించి న్యాయముతో ప్రజాపాలన మొనర్చవలయును. [౨౨౩]

౨౨౮. ఐంద్రః ప్రాణ ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, త్వష్టా దేవతా, బ్రాహ్మ్యనుష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పున స్తత్రాన్యోన్యం కథం వర్తేర న్నిత్యుపదిశ్యతే.

సంగరమందు వీరపురుషులు పరస్పర మెటుల ప్రవర్తించవలయునను విషయ ముపదేశించబడినది.

ఐన్ద్రః ప్రాణో॑ఽఅఙ్గే॑ఽఅఙ్గే నిదీ॑ధ్యదైన్ద్రఽఉదానో॑ఽఅఙ్గే॑ అఙ్గే॒ నిధీ॑తః। దేవ॑ త్వష్ట॒ర్భూరి॑ తే॒ సఀసమే॑తు సల॑క్ష్మా॒ యద్విషు॑రూపం॒ భవా॑తి। దే॒వత్రా॒ యన్త॒ మవ॑సే॒ సఖా॑యో॒ఽను॑ త్వా॒ మా॒తా॒పి॒తరో॑ మదన్తు॥ ॥౬.౨౦॥

ఐంద్రః, ప్రాణః, అఙ్గేఽఅఙ్గ ఇత్యఙ్గే అఙ్గే, ని, దీధ్యత్, ఐన్ద్రః, ఉదాన ఽఇత్యుత్ +ఆనః,అఙ్గేఅఙ్గ ఇత్యఙ్గే అఙ్గే, నిధీత్ర ఇతి నిధీతః, దేవ, త్వష్టః భూరి, తే, సఀసమితి, సమ్, సమ్, ఏతు, సలక్ష్మేతి సలక్ష్మ, యత్, విషురూపమితివిషు రూపమ్, భవాతి, దేవత్రేతి దేవత్రా, యన్తమ్, అవసే,సఖాయః,అను,త్వా, మాతా, పితరః, మదన్తు.

పదార్థః (ఐంద్రః)ఇంద్రో జీవో దేవతాఽస్య స ఐంద్రః(ప్రాణః)శరీరస్థో వాయువిశేషః (అంగే అంగే) యథా ప్రత్యంగం ప్రకాశతే (ని) నితరామ్ (దీధ్యత్) యుద్ధే శత్రూన్ వఞ్చిత్వా స్వయం ప్రకాశేత (ఐన్ద్రః) విద్యుద్దేవతాకః(ఉదానః)య ఊర్ధ్వమనితి(అంగే అంగే)ప్రత్యంగమ్ (నిధీతః) నిహిత ఇవ (దేవ) దివ్యవిద్యాసంపన్న సేనాధ్యక్ష! (త్వష్టః) శత్రుబలచ్ఛేత్తః (భూరి) బహు(తే)తవ(సమ్ సమ్)ఏకీభావే, అత్ర ప్రసముపోదః పాదపూరణే అ.౮.౧-౬. ఇతి సమిత్యస్య ద్విత్వమ్. (ఏతు) ప్రాప్నోతు.(సలక్ష్మ)సమానం లక్ష్మ యస్య తత్. అన్యేషామపి దృశ్యత ఇతి దీర్ఘః. (విషురూపమ్) వ్యాపకం వివిధరూపం వా(భవాతి)భవతు. (దేవత్రా)దేవం దేవమితి దేవత్రా (యంతమ్) గచ్ఛతమ్ (అవసే) రక్షణాద్యాయ (సఖాయః) సుహృదః సన్తః (అను)(త్వా)త్వామ్ (మాతా) జననీ (పితరః) రక్షకా జనకాః (మదన్తు) హర్షన్తు. అయమ్మన్త్రః శత. ౩. ౫. ౪-౩౭. వా

అన్వయః :— హే త్వష్ట ర్దేవ సేనాపతే ! భగవన్ అంగే అంగే ఐన్ద్రః ప్రాణ ఇవావసే సంగ్రామే విదీధ్యత్ యద్వా అంగే అంగే ఉదాన ఇవ సంగ్రామే నిధీతో భవాతి.యత్ తే తవ విషు రూపం సలక్ష్మ భవాతి తత్సంగ్రామే భూరి యథా స్యాత్తథా సంసమేతు. సఖాయో మాతా పితరశ్చ దేవత్రా ధర్మ్యం యుద్ధం వ్యవహారం వా యంతం త్వా త్వామనుమదన్తు.

భావార్థః :— సేనాపతిః సర్వమిత్రోఽఙ్గేఽఙ్గే ప్రాణ ఉదాన ఇవ సంగ్రామే విచరన్ సేనాస్థ వీరాన్ ప్రజాస్థపురుషాంశ్చ హర్షయిత్వా శత్రూన్విజయేత.

పదార్థము :-(త్వష్టః) ఓ శత్రుబల విదారకా! (దేవ) దివ్య విద్యాసంపన్నుడవైన సేనాపతీ ! నీవు(అవసే)రక్షాదుల నిమిత్తమై ఎటుల(అంగే అంగే) ప్రతి అంగమునందు (ఐంద్రః) ఇంద్రుడన జీవము, అది దేవతగా గలిగియున్న శరీరమంతట వసించు ప్రాణవాయువు సకల వాయువులను తిరస్కరించుచు స్వయముగ ప్రకాశించుచున్నదో అటులనే నీవును సంగరమందు నిఖిల శత్రువులను తిరస్కరించుచు(నిదీధ్యత్)ప్రకాశకుడవుకమ్ము, లేక (అంగే అంగే)ఎటుల ప్రతి యంగమున(ఉదానః)అన్నాది పదార్థముల నూర్ధ్వమునకు చేర్చు నుదానవాయువు ప్రవృత్తమెయున్నదో, అటులనే స్వవిభవముచే సకల వీరులను ప్రోత్సహించుచు సంగ్రామమునందు(నిధీతః)నిరంతరము నిలబడిన వానివలె ప్రకాశితుడవుకమ్ము'(యత్ తే విషురూపమ్)నీ వివిధరూపములలో[వ్యాపకమై యున్న](సలక్ష్మ)

పరస్పర యుద్ధలక్షణ మేది(భవాతి)ఉన్నదో అది(సంగ్రామే)సంగరమందు(భూరి) విస్తార ముగ(సంసమ్)(ఏతు)ప్రవృత్తమగునుగాక! ఓ సేనాధ్యక్షా! నీరక్షణకై సమస్త శూర వీర పురుషులు(సఖాయః)మిత్రులై ప్రవర్తించెదరుగాక!(మాతా)జనని(పితరః)పిత, పితృవ్యు లు, భృత్యులు, శుభచింతకులు[మున్నగు వారందరు](దేవత్రా) దేవతలను, విద్వాంసు లను, ధర్మయుక్త యుద్ధమును, ధర్మయుక్త వ్యవహారమును(యంతమ్) పొందుచున్న (త్వా)నిన్ను(అనుమదంతు) అనుమోదింతురుగాక!

భావార్థము :-ఎటుల ప్రతియుగమునందు ప్రాణోదానాదులు ప్రవర్తమానములై యున్నవో, అటులనే సకల ప్రాణులయందు మిత్రభావముతో మెలగు సేనాపతి సంగ్రా మమునందు విచరించుచు [విహరించుచు] సేనను, ప్రజాపురుషులను సంతసింపజేసి శత్రు వులను జయించుగాక! [౨౨౦]

---

౨౧. సముద్రం గచ్ఛేత్యాదే ర్దీర్ఘతమా ఋషిః, సేనాపతి ర్దేవతా, యాజుష్య ఉష్ణిషచ్ఛందాంసి ఋషభః స్వరః.

అథ రాష్ట్రకర్మానుష్ఠాతుమర్హాయ శిష్యాయ గురుః కిం కిముపదిశేదిత్యాహ.

రాజ్యకార్యమొనర్చుటకు యోగ్యుడైన శిష్యునకు గురువేమేమి యుపదేశించవలయును? ఇందు చెప్పబడుచున్నది.

సముద్రఙ్గచ్ఛ స్వాహాన్తరిక్షఙ్గచ్ఛ స్వాహా దేవꣳ సవితారఙ్గచ్ఛ స్వాహా। మిత్రావరుణౌ గచ్ఛ స్వాహాఽహోరాత్రే గచ్ఛ స్వాహా ఛన్దాꣳసి గచ్ఛ స్వాహా ద్యావా పృథివీ గచ్ఛ స్వాహా యజ్ఞం గచ్ఛ స్వాహా సోమం గచ్ఛ స్వాహా దివ్యన్నభో గచ్ఛ స్వాహాగ్నిం వైశ్వానరఙ్గచ్ఛ స్వాహా మనో మే హార్ది యచ్ఛ దివన్తే ధూమో గచ్ఛతు స్వర్జ్యోతిః ప్రథివీ మ్భస్మనా పృణ స్వాహా॥ ॥౬.౨౧.॥

సముద్రమ్, గచ్ఛ, స్వాహా, అన్తరిక్షమ్, గచ్ఛ, స్వాహా, దేవమ్, సవితారమ్, గచ్ఛ, స్వాహా, మిత్రావరుణౌ, గచ్ఛ, స్వాహా, అహోరాత్రేఽఇత్యహోరాత్రే, గచ్ఛ, స్వాహా, ఛందాసి, గచ్ఛ, స్వాహా, ద్యావా పృథివీ÷ఇతి ద్యావాపృథివీ, గచ్ఛ, స్వాహా, యజ్ఞమ్, గచ్ఛ, స్వాహా, సోమమ్, గచ్ఛ స్వాహా,దివ్యమ్, నభః, గచ్ఛ, స్వాహా, అగ్నిమ్, వైశ్వానరమ్,గచ్ఛ, స్వాహా, మనః, మే, హార్ది, యచ్ఛ, దివమ్, తే, ధూమః, గచ్ఛతు, స్వః, జ్యోతిః, పృథివీమ్, భస్మనా, ఆ, పృణ, స్వాహా.

పదార్థః :— (సముద్రమ్) సముద్రవన్తి జలాని యస్మిన్ తముదధిమ్ (గచ్ఛ) (స్వాహా) బృహన్నౌకారచనాదివిద్యాసిద్ధేన యానేన (అన్తరిక్షమ్) ఆకాశమ్ (గచ్ఛ)(స్వాహా) ఖగోళప్రకాశికయా విద్యయా సంపాదితేన విమానేన (దేవమ్) ద్యోతమానం పరమేశ్వరం (గచ్ఛ) జానీహి (స్వాహా) వేదవాచా సత్సంగసంస్కృతయా వా (మిత్రావరుణౌ) ప్రాణోదానౌ (గచ్ఛ) ప్రాణాయామాభ్యాసేన విద్ధి (స్వాహా) యోగయుక్త్యా వాచా (అహోరాత్రే) అహశ్చరాత్రిశ్చ అహోరాత్రే హేమంతశిశిరావహోరాత్రే చ ఛందసి అ. ౨. ౪-౨౮. అనేన నపుంసకత్వమ్. (గచ్ఛ) కాల విద్యయా జానీహి యాహి వా (స్వాహా) జ్యోతి ర్బోధయుక్త్యా వాచా (ఛందాంసి) ఋగ్యజుః సామాథర్వాణశ్చతురో వేదాన్. (గచ్ఛ) పఠనపాఠనపురస్సరేణ శ్రవణమనననిదిధ్యాసనసాక్షాత్కారేణ విజానీహి. (స్వాహా) వేదాఙ్గాది విజ్ఞాన సహితయా వాచా (ద్యావా పృథివీ)ద్యౌశ్చ పృథివీచ తౌ భూమిసూర్యౌ తద్గతావభీష్టదేశదేశాంతరావితి యావత్ (గచ్ఛ) జానీహి(స్వాహా) భూమియానాకాశయాన రచన భూగోల భూగర్భ ఖగోల విద్యయా (యజ్ఞమ్)అగ్నిహోత్ర శిల్ప రాజ వ్యవహారాదికమ్. (గచ్ఛ) (సోమమ్) ఓషధిసమూహమ్ (గచ్ఛ) జానీహి (స్వాహా) వైద్యక శాస్త్ర బోధార్థాయా వాచా (దివ్యమ్) వ్యవహర్తవ్యం శుద్ధమ్ (నభః) జలమ్(గచ్ఛ)ప్రాప్నుహి(స్వాహా) తద్గుణ విజ్ఞాపయిత్ర్యా వాచా (అగ్నిమ్) విద్యుతమ్ (వైశ్వానరమ్) సర్వత్ర ప్రకాశమానమ్(గచ్ఛ)జానీహి (స్వాహా) తద్బోధయుక్త్యా వాణ్యా (మనః) చిత్తమ్ (మే) మమ (హార్ది) హృదయస్యాతిశయేన ప్రియమ్ (గచ్ఛ) నిధేహి (దివమ్) సూర్యమ్ (తే) తవ (ధూమః) యంత్రజ్వలనబాష్పః (స్వః) సుఖమ్ (అంతరిక్షమ్) అవకాశమ్ (జ్యోతిః) జ్వాలామ్(పృథివీమ్) భస్మనా(ఆ)సమంతాత్(పృణ) యోజయ(స్వాహా) యజ్ఞానుష్ఠాన యంత్ర రచన విద్యయా. అయమ్మంత్రః శత ౩.౬.౫ ౧౧-౧౮. తథా ౭. ౧. ౧-౫. వ్యాఖ్యాతః.

అన్వయః:— హే రాజకర్మానుష్ఠానార్హ! విద్వంస్త్వం స్వాహా సముద్రం గచ్ఛ. స్వాహాఽన్తరిక్షం గచ్ఛ స్వాహా దేవం సవితారం గచ్ఛ. స్వాహా మిత్రావరుణౌ గచ్ఛ. స్వాహాఽహోరాత్రే గచ్ఛ. స్వాహా యజ్ఞం గచ్ఛ. స్వాహా సోమం గచ్ఛ. స్వాహా దివ్యం నభో గచ్ఛ స్వాహాఽగ్నిం వైశ్వానరం చ గచ్ఛ. మే మమ మనో హార్ది గచ్ఛ. తే తవ ధూమో దివ్యం జ్యోతిః స్వర్గచ్ఛతు. త్వం స్వాహా భస్మనా పృథివీ మాపృణ.

భావార్థః :— ధర్మాదిరాజ్యవ్యాపారకరణవృత్తి మభీప్సుభి ర్జనై ర్భూమియానాంతరిక్షయానాకాశయానై ర్వివిధయంత్రకలారచనైశ్చ సర్వాః సామగ్రీః సంపాద్య ద్రవ్యసంచయః కార్యః.

పదార్థము :- ధర్మాది రాజ్యకర్మ లొనర్చదగిన శిష్యుడా! నీవు(స్వాహా)పెద్దపెద్ద అశ్వతరీనావలను, పొగయోడలను నిర్మించు విద్యచే నౌకాది యానముల నధిష్ఠించి (సముద్రం గచ్ఛ)సముద్రమును దాటుము.(స్వాహా)ఖగోళమును ప్రకాశింపజేయు విద్యచే సిద్ధమొనర్చబడిన విమానాది యానములతో (అంతరిక్షమ్ గచ్ఛ) ఆకాశమును అధిగమించుము.(స్వాహా) వేదవాణితో(దేవమ్)ప్రకాశమానుడగు(సవితారమ్)సకలము నుత్పన్న మొనర్చు పరమేశ్వరుని(గచ్ఛ)తెలుసుకొనుము. (స్వాహా) వేద సంగతిచేతను, సజ్జన సాంగత్యముచేతను శుద్ధమైనదియు, సంస్కరింపబడినదియునగు వాణిచేతను (మిత్రావరుణౌ) ప్రాణోదాన [వాయువు] లను(గచ్ఛ)గుర్తించుము. (స్వాహా) జ్యోతిషవిద్య

చే (అహోరాత్రే)దివారాత్రములను, వాని గుణములను(గచ్ఛ)గ్రహించుము.(స్వాహా) వేదాంగ విజ్ఞాన సహితమగు వాణిచే(ఛందాంసి)ఋగ్యజుస్సా మాథర్వములను చతుర్వేదములను(గచ్ఛ)బాగుగా నెఱుగుము.(స్వాహా) భూయాన, ఆకాశమార్గయాన రచనల చేతను,భూగోళ భూగర్భ ఖగోళ విద్యల ద్వారాను (ద్యావాపృథివీ) భూమిస్థములును సూర్యప్రకాశస్థములునగు అభీష్ట దేశదేశాంతరములను(గచ్ఛ)ఎరుగుము మఱియు పొందుము.(స్వాహా)సంస్కృతమైనవాణిచే(యజ్ఞమ్) అగ్నిహోత్రమును, శిల్పవిద్యను, రాజనీతిని, యజ్ఞమును (గచ్ఛ)పొందుము. (స్వాహా)వైద్యక విద్యచే(సోమః)సోమలతాది ఓషధి సమూహమును,(గచ్ఛ)తెలిసికొనుము.(స్వాహా) జలములయొక్క గుణావగుణములను బోధజేయు విద్యచే (దివ్యమ్) వ్యవహరించుటకుపయుక్తములగు పవిత్రములైన (నభః) జలములను(గచ్ఛ) ఎఱుగుము, మఱియు (స్వాహా) విద్యుత్తును, ఆగ్నేయాస్త్రాదులను, తంతి మరియు సకల కలాయంత్రములను ప్రకాశితమొనరించు విద్యచే(అగ్నిమ్) విద్యుదగ్నిని(గచ్ఛ)బాగుగా నెరుగుము. మరియు(మే మనః)నా మనస్సును(హార్ది) ప్రీతియుక్తముగ(గచ్ఛ) సత్యధర్మమునందు స్థితమొనర్చుము. అనగా నా ఉపదేశము ననుసరించి ప్రవర్తించుము. మరియు(తే)నీయొక్క (ధూమః) కళలయొక్కయు మఱియు యజ్ఞాగ్నియొక్కయు పొగ (దివమ్) సూర్యప్రకాశమును మఱియు (జ్యోతిః) దాని జ్వాల (స్వః)అంతరిక్షమును(గచ్ఛతు)ప్రాప్తించునుగాక! మఱియు నీవు యంత్రకళయందున్న అగ్నియందు(స్వాహా) కాష్ఠాది పదార్థములను భస్మమొనరించి (భస్మనా) ఆ భస్మముచే (పృథివీమ్)పృథివిని(ఆపృణ)ఆచ్ఛాదింపజేయుము.

భావార్థము :- ధర్మార్థ కామమోక్షరాజ్యవాణిజ్యాదులను కోరు పురుషుడు భూమి యానములను, అంతరిక్షయానములను, మఱియు ఆకాశమార్గమున ప్రయాణమొనరించు విమానాది రథములను, లేక నానా ప్రకారములగు కళాయంత్రములను నిర్మించియు, సకల సామగ్రిని సంగ్రహపఱచియు, ధనమును, రాజ్యమును ఉపార్జించవలయును. [౨౯]

౨౩౦. మాప ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, వరుణో దేవతా, బ్రాహ్మీ స్వరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః, సుమిత్రియా న ఇత్యస్య విరాడ్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ వాణిజ్యార్థం రాజప్రబంధమాహ.

వాణిజ్య వ్యాపారములొనర్చుటకు రాజ్యప్రబంధము చెప్పబడినది.

మాపో మౌషధీర్హింసీర్ధామ్నో ధామ్నో రాజఁస్తతో వరుణ నో ముఞ్చ।
యదాహురఘ్న్యా ఇతి వరుణేతి శపామహే తతో వరుణ నో ముఞ్చ।

సుమిత్రియా న ఽఆప ఽఓషధయః సంతు దుర్మిత్రియా స్తస్మై సన్తు యోఽస్మాన్ద్వేష్టి యఞ్చ వయం ద్విష్మః॥ ॥౬.౨౨.॥

మా, అపః, మా, ఓషధీః, హింసీః, ధామ్నోధామ్న+ఇతి ధామ్నః, ధామ్నః, రాజన్, తతః, వరుణ, నః, ముఞ్చ, యత్, అఘ్న్యాః, అఘ్న్యాః, వరుణ ఇతి, శపామహే, సుమిత్రియా ఇతి సుమిత్రియాః, నః, ఆపః, ఓషధయః, సంతు, దుర్మిత్రియా+ఇతి దుఃమిత్రియాః,తస్మై, సన్తు, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః.

పదార్థః :- (మా) నిషేధే (అపః) జలాని (మా) నిషేధే (ఓషధీః) యవాదీన్ (హింసీః) (ధామ్నో ధామ్నః) స్థానాత్ స్థానాత్ (రాజన్) సభాపతే ! (తతః) తస్మాత్ (వరుణ)ప్రశస్త(నః) అస్మాన్(ముఞ్చ)(యత్)(అహుః)(అఘ్న్యాః)హన్తుమయోగ్యా గావస్తాః.అఘ్న్యా ఇతి గోనామసు పఠితమ్ నిఘం. ౨.౧౧.(ఇతి)అనేన ప్రకారేణ(వరుణ)న్యాయకారిన్!(ఇతి) ప్రకారాంతరే (శపామహే)(సుమిత్రియాః)సుమిత్రాణీవ(నః)అస్మభ్యమ్(ఆపః) (ఓషధయః) (సంతు) (దుర్మిత్రియాః) దుర్మిత్రాణీవ (తస్మై)ద్విషతే (సంతు) (యః) అమిత్రః (అస్మాన్) ద్వేష్టి(యమ్ చ)(వయమ్) (ద్విష్మః).

అన్వయః :- హే రాజన్! త్వమప ఓషధీశ్చ మా హింసీః. న కేవలమిదమేవ కుర్యాః. కింతు తతో ధామ్నో ధామ్నోఽస్మాన్ మా ముఞ్చ. హే వరుణ! అఘ్న్య ఇతి యద్భవన్త ఆహుః వయం చేత్థం శపామహే, తతస్త్వం మా ముఞ్చ. వయమపి న ముఞ్చామః. హే వరుణ ! నః అస్మభ్యమాప ఓషధయశ్చ సుమిత్రియా స్సుమిత్రవత్ సన్తు.యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మ స్తస్మై దుర్మిత్రియాః శత్రువత్ సన్తు.

భావార్థః :- రాజపురుషాః ప్రజాభ్యోఽనీత్యా ధనం న గృహ్ణీయుః. రాజరక్షణాయ ప్రతిజ్ఞాం కుర్యు రన్యాయం వయం న కరిష్యామ ఇతి దుష్టాన్ సతతం దండయేయు రితి.

పదార్థము :-(రాజన్)ఓ సభాపతీ! నీవు నీ ప్రత్యేకస్థానములందు (ఆపః) జలములను మరియు(ఓషధీః)అన్నపాన పదార్థములను, కిరానాభోజన సంభారములను,[వ్యాపారపు దినుసులను]వనజ పదార్థములను (మా హింసీః)నష్టమొనర్చకుము. అనగా ప్రతిచోట మాకు వలయు పదార్థములు లభించుచునుండవలయును. చేయవలసినది ఇంతియే కాదు,ఇంకా(తతః ధామ్నః ధామ్నః)ఆ యా స్థానములనుండి(నః)మనుష్యుల(మా ముంచ)త్యజించకుము (వరుణ) ఓ న్యాయమొనరించువాడా! సభాపతిచేసిన న్యాయములో (అఘ్న్యాః)చంపతగని గవాది పశువులతోడు(ఇతి) అని నీవే ఒట్టుచెప్పుచున్నావు మఱియు మేమును(శపామహే) శపథమొనర్చుచున్నాము. నీవును ఈ ప్రతిజ్ఞను వీడకుము,

మేమును పీడము. ఓ వరుణా! మీరాజ్యమునందు (నః)మాకు (ఆపః) జలములు ఓషధులు (సుమిత్రియాః సంతు) శ్రేష్టమిత్రునితో తుల్యము [సుమిత్ర తుల్యము]లగుగాక! మఱియు (యః)ఎవడు (అస్మాన్ ద్వేష్టి)మాతో వైరము వహించుచున్నాడో, (చ) మఱియు (వయమ్) మేము (యమ్ ద్విష్మః) ఎవనిని ద్వేషించుదుమో (తస్మై) అతనికై యా ఓషధులు (దుర్మిత్రియాః) దుఃఖమును కలిగించు శత్రుతుల్యములగు గాక !

భావార్థము :— రాజు, రాజ పురుషులు ప్రజలనుండి అవినీతిగా ప్రజల ధనమును గ్రహించ కూడదు. మరేమనిన రాజ్యపాలనకై రాజపురుషులు "మే మన్యాయ మొనర్పము. నిరతము మేము మిమ్ము కాపాడెదము. దొంగలను, దోపిడికాండ్రను, లంపటులను, కపటులను, కుమార్గులను, అన్యాయులను, కుకర్ములను నిరంతరము దండించెదమని" ప్రతిన బూనవలయును. [౨౩౦]

---

౨౩౧. హవిష్మతీరిత్యస్య దీర్ఘతమా ఋషిః, అపయజ్ఞ సూర్యాః దేవతాః, నిచృదార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునరన్యోఽన్యం మిలిత్వా రాజప్రజే కేన కిం కిం కుర్యాతా మిత్యాహ.

రాజు ప్రజలు కలసి దేనిచే నేమేమి చేయవలయునను విషయ

మీ మంత్రమందుపదేశించ బడినది.

హవిష్మతీ రిమా ఆపో హవిష్మాఁ౨॥ ఆవివాసతి।

హవిష్మాన్ దేవో అధ్వరో హవిష్మాఁ౨॥ అస్తు సూర్యః॥ ఒ.౨౩॥.

హవిష్మతీః, ఇమాః, ఆపః, హవిష్మాన్, ఆ, వివాసతి,హవిష్మాన్,దేవః, అధ్వరః, హవిష్మాన్, అస్తు, సూర్యః.

పదార్థః :-(హవిష్మతీః)ప్రశస్తాని హవీంషి విద్యన్తే యాసు తాః(ఇమాః)ప్రత్యక్షాః (ఆపః) జలాని (హవిష్మాన్) ప్రశస్తాని హవీంషి విద్యన్తే యస్య వాయోః సః. దీర్ఘాదటి సమానపాద ఇతి రుః. ఆతో టి నిత్యమితి సానునాసికత్వమ్(ఆ) సమన్తాత్ (వివాసతి) సేవతే. వివాసతీతి పరిచరణ కర్మసు పఠితమ్. నిఘం. ౩.౩.(హవిష్మాన్)(దేవః)సుఖయితా (అధ్వరః) యజ్ఞః (హవిష్మాన్) అస్తు. (సూర్యః).

అన్వయః :- హే విద్వాంసో యథేమా ఆపో హవిష్మతీర్హవిష్మత్యః స్యు రయం వాయుర్హవిష్మానేవావివాసతి, సర్వాన్ పరిచరతి, దేవోఽధ్వరో హవిష్మాన్ స్యాత్, సూర్యో హవిష్మాన్ అస్తు భవేత్, తథా భవంతో యజ్ఞైనైతాన్ శుద్ధాన్ కుర్వన్తు.

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యేన వాయుజల సంయోగేనానేకాని సుఖాని సాధ్యంతే, యై ర్వివిధదేశదేశాంతరగమనేన వస్తుప్రాపణం భవతి, తై రేతత్ కర్మ క్రియా విచక్షణ ఏవ కర్తుం శక్నోతి. యో వివిధక్రియాప్రకాశకోఽస్తి, స యజ్ఞో వృష్ట్యాది సుఖకరో భవతి.

పదార్థము:— ఓ విద్వాంసులారా ! (ఇమాః ఆపః) ఈ జలములు (హవిష్మతీః) బాగుగా ఆదాన ప్రదానము లొనర్చునవియు, క్రియాశుద్ధి [కరములును] సుఖప్రదము లును అగుగాక ! అనగా సకల విధములగు నుపకారములు పరస్పరము సమకూర్చుకొన గలుగు కార్యముల నొనర్చుడు.(హవిష్మాన్)పవనము ఉపకారా నుపకారములను (ఆవి వాసతి)చక్కగా పరిచార మొనర్చును గాక! (దేవః)సుఖము నొసగు(అధ్వరః)యజ్ఞము కూడ (హవిష్మాన్) పరమానంద ప్రదము[అగు గాక !](సూర్యః)సూర్యలోకముకూడ (హవిష్మాన్) సుగంధాది యుక్తమై సుఖదాయకము (అస్తు) అగు గాక !

భావార్థము :— ఈ మంత్రమున వాచక లుప్తోపమాలంకార మున్నది.ఏ వాయు జలముల సంయోగముచే అనేక సుఖములు సాధించబడు చున్నవో, వేనివలన దేశ దేశాంతరములకు పోగలుగుటచే ఉత్తమోత్తమ వస్తువుల ప్రాప్తి లభించుచున్నదో, ఆ అగ్ని జలాది పదార్థములతో ఉక్త కార్యములను క్రియాచతురు డగు పురుషుడే చేయ గలుగు చున్నాడు. మరియు నెవ డనేక రకముల శిల్పవిద్యలను, అనేక క్రియలను ప్రకాశ మొనర్చునో అతడే యజ్ఞమును, వర్షా ద్యుత్తమోత్తమ సుఖములను సమకూర్చు వాడగుచున్నాడు. [౨౩౧]

౨౩౨. అగ్నే ర్వ ఇత్యస్య మేధాతిథి ర్ఋషిః, ఆర్చీత్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః, అమూ ర్యేత్యస్య త్రిపాద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

**అథ గురుపత్న్యై బ్రహ్మచర్య మనువర్తినీః కన్యాః కిం. కిముపదిశేయు రిత్యాహ.**

బ్రహ్మచర్యమును పాలించు కన్యలకు గురుపత్నులేమి యుపదేశించవలయునను విషయమిందు చెప్పబడినది.

అగ్నే ర్వోఽపన్నగృహస్య సదసి సాదయామీన్ద్రాగ్న్యో ర్భాగధేయీ స్థ మిత్రావరుణయో ర్భాగధేయీ స్థ విశ్వేషాం దేవానాం భాగధేయీ స్థ। అమూర్యా ఉప సూర్యే యాభిర్వా సూర్యః సహ తా నో హిన్వ న్త్వధ్వరమ్॥ ॥౬.౨౪.॥

అగ్నేః, వః, అపన్నగృహస్యేత్యపన్న గృహస్య, సదసి, సాదయామి, ఇంద్రాగ్న్యోః, భాగధేయీరితి భాగధేయీః, స్థ, మిత్రావరుణయోః. విశ్వేషామ్, దేవానామ్, అమూః, యాః, ఉప, సూర్యే, యాభిః, వా, సూర్యః, సహ, తాః,నః, హి న్వన్తు, అధ్వరమ్.

పదార్థః-(అగ్నేః) విద్యాదిగుణ ప్రకాశితస్య సభ్యజనస్య (వః) యుష్మాన్ యుష్మాకం వా (అపన్నగృహస్య)అప్రాప్తగృహస్య కుమారబ్రహ్మచారిణః (సదసి) సీదంతి బుద్ధివిషయా యస్మిన్నితి సదః అధ్యయనాధ్యాపన నిమిత్తా సభా తత్ర(సాదయామి)స్థాపయామి(ఇంద్రాగ్న్యోః)సూర్యవిద్యుతో ర్గుణానామ్(భాగధేయీః)విభాగ విజ్ఞానయుక్తాః. నామరూపభాగేభ్యః స్వార్థే ధేయః ప్రత్యయః అ.౫-౪-౩౬. కేవల మామకే త్యాదినా అ.౪-౧-౩౦ జీప్(స్థ)భవథ(మిత్రావరుణయోః)ప్రాణోదానయోః(విశ్వేషామ్)సర్వేషామ్(దేవానామ్)విదుషాం పృథివ్యాదీనాం వా(అమూః)ప్రత్యక్షాః(యాః)(ఉప)(సూర్యే)సవితృలోకే(యాభిః)(వా)పక్షాంతరే(సూర్యః)సూర్యలోకః(సహ)(తాః)(నః)అస్మాకమ్(హిన్వన్తు)ప్రీణంతు(అధ్వరమ్)గృహాశ్రమక్రియాసిద్ధికరం యజ్ఞమ్.

అన్వయః :- హే బ్రహ్మచారిణ్యో యూయం యా అమూః స్వయంవర వివాహం కృతవత్యః సన్తి. ఇన్ద్రాగ్న్యో ర్భాగధేయీ స్థ. మిత్రావరుణయో ర్భాగధేయీః స్థ. విశ్వేషాం దేవానాం భాగధేయీః స్థ, తా వో యుష్మాన్ అపన్నగృహస్యాగ్నేః సదస్యహం సాదయామి.యా ఉపసూర్యే సూర్యగుణేషు తిష్ఠంతి, వా యాభిః సహ సూర్యో వర్తతే, తా నోఽస్మాక మధ్వరం వివాహం కృత్వా హిన్వన్తు.

భావార్థః :- బ్రహ్మచర్యధర్మ మనువర్తినీనాం కన్యానా మవివాహితైః స్వతుల్యగుణకర్మస్వభావైః పురుషైః సహైవ. వివాహ కరణయోగ్యతాఽస్తీతి హేతో ర్గురుపత్న్యో బ్రహ్మచారిణ్యః కన్యా స్తాదృశ మేవోపదిశంతు. ఖల్వాపత్కాలే కృతవివాహయో ర్నియోగో భవితుమర్హతి నాన్యథేతి.

పదార్థము :- బ్రహ్మచారిణులగు నో కన్యలారా!(అమూః) (యాః) స్వయంవర వివాహముచే పతులను వరించిన యే యీ కన్యలున్నారో, వారివలె, (ఇంద్రాగ్న్యోః) సూర్యవిద్యుత్తుల గుణములను(భాగధేయీః)వేరువేరుగా నెరుగువారెవరు(స్థ)ఉన్నారో, (మిత్రావరుణయోః)ప్రాణోదానముల గుణములను (భాగధేయీః)విడివిడిగా నెఱుగువారెవరు(స్థ)ఉన్నారో,(విశ్వేషామ్)విద్వాంసులను మరియు పృథివ్యాది పదార్థములను సేవించు వారెవరు (స్థ) ఉన్నారో, అట్టి(వః)మీ యందఱను (అపన్న గృహస్య) గృహకృత్యములింకను పొందనివారును, బ్రహ్మచర్య ధర్మానుష్ఠానమొనర్చినవారును(అగ్నేః) (సదసి) సకల విద్యాది గుణములచే ప్రకాశితులుననగు నుత్తమ బ్రహ్మచారుల సభలో నేను(సాదయామి)స్థాపించుచున్నాను. మరియు(యాః, ఉప, సూర్యే)ప[స్త్రీలు] సూర్యలోకపు గుణములలో నుపస్థితురాండ్రగుచున్నారో(వా)లేక(యాభిః సహ)ప మహిళలతోపాటు(సూర్యః)సూర్యలోకము వర్తమానమై యున్నదో,ప[విదుషీమణులు]సూర్యుని గుణములందతిచతురురాండ్రో, (తాః) వారందరు (నః)మాయొక్క (అధ్వరమ్) గృహ కార్యభారమును వహించు యజ్ఞమును(హిన్వంతు)అభివృద్ధి పఱచెదరుగాక!

భావార్థము :- బ్రహ్మచర్య ధర్మమును పాలించు కన్యలకు అవివాహిత బ్రహ్మచారులను, మరియు తన[గుణకర్మస్వభావముల]తో సమానములగు గుణకర్మ స్వభావములు కలిగియున్న పురుషులను వివాహమాడుటకు అర్హతకలదు. కావున గురుజనుల సతీమణులు, బ్రహ్మచారిణులగు కన్యలకు వారు తమ యిష్టముమీద తుల్యగుణ స్వభావ

యుక్త పురుషులను వివాహమాడి సర్వదా సుఖులుగా నుండునటుల ఉపదేశించవల యును. పతి చనిపోయిన స్త్రీ, భార్య గతించిన పురుషుడు సంతానేచ్ఛువులగుచో నా యిరువురు నియోగమొనర్చుకొన వచ్చును. కాని, వ్యభిచారాద్యన్య కర్మలనెన్నటికి నాచరించకూడదు. [౨౩.౨]

౨౩౩. హృదే త్వేత్యస్య మేధాతిథి ర్ఋషిః, సోమో దేవతా, ఆర్షీ విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తాః కిం కిముపదిశేయు రిత్యాహ.

ఇంక వారేమి యుపదేశించవలయునను విషయమిందు చెప్పబడినది.

హృదే త్వా మనసే త్వా దివే త్వా సూర్యాయ త్వా ఊర్ధ్వ మిమ మధ్వరం దివి దేవేషు హోత్రా యచ్ఛ॥ ॥౬.౨౫.॥

హృదే, త్వా, మనసే, త్వా, దివే, త్వా, సూర్యాయ, త్వా, ఊర్ధ్వమ్, ఇమమ్, అధ్వరమ్, దివి, దేవేషు, హోత్రాః, యచ్ఛ.

**పదార్థః :-** (హృదే) హృత్సుఖాయ (త్వా) త్వామ్ (మనసే) సదసన్మననాయ (త్వా) త్వామ్ (దివే) సర్వసుఖ ద్యోతనాయ (సూర్యాయ) సూర్యగుణాయ (త్వా) త్వామ్ (ఊర్ధ్వమ్) ఉత్కృష్టమ్ (ఇమమ్) ప్రత్యక్షమ్ (అధ్వరమ్) అవినశ్వరం యజ్ఞమ్ (దివి) శుభగుణప్రకాశే (దేవేషు) విద్వత్సు (హోత్రాః) హవనకర్మానుష్ఠాత్ర్యః (యచ్ఛ) ఉపగృహ్ణీహి. అయం మంత్రః శత. ౩.౭.౪, ౪-౫. వ్యాఖ్యాతః

**అన్వయః :-** హే బ్రహ్మచారిణి! కన్యే! త్వం యథా వయం సర్వా దేవేషు స్వపతిషు సమీప వర్తిన్యో హోత్రా హవనకర్మానుష్ఠాత్ర్యః స్మ స్తథా భవ. యథా వయం హృదే త్వా, మనసే త్వా, దివే త్వా, సూర్యాయ త్వానుశాస్మ స్తథా దివీమమధ్వర మూర్ధ్వం యచ్ఛ.

**భావార్థః :-** యథా పతివ్రతాః స్వపతిషు తత్ప్రియమాచరన్త్యోఽగ్నిహోత్రాది కర్మసు నిరతాః స్యుస్తథా వివాహానంతరం బ్రహ్మచారిణీభి ర్బ్రహ్మచారిభిరపి పరస్పర మనువర్తితవ్యమితి.

పదార్థము :- ఓ బ్రహ్మచారిణీ! మేమెటుల (దేవేషు) మాకు సుఖము కలిగించు పతుల సమీపమున నుండువారముగ, [(హోత్రాః)] అగ్నిహోత్రాది కర్మల ననుష్ఠించు వారముగ నున్నామో అటులనే నీవును కమ్ము. మరియు మేమెటుల (హృదే) సౌహార్ద సుఖమునకై (త్వా) నిన్ను (మనసే) మంచి చెడు విచారించుటకై (త్వా) నిన్ను (దివే) సర్వ సుఖములను ప్రకాశింపజేయుటకు (త్వా) నిన్ను (సూర్యాయ) సూర్యునితో సదృశములగు గుణములకొరకు (త్వా) నిన్ను శిక్షగఅపుచున్నానో అటులనే నీవును (దివి) సమస్త సుఖములను ప్రకాశమొనర్చు నిమత్తము (ఇమమ్ అధ్వరమ్) నిరంతరము సుఖముచేకూ ర్చు గృహాశ్రమరూపమగు నీ యజ్ఞమును (ఊర్ధ్వమ్ యచ్ఛ) వృద్ధి పఱచుము.

భావార్థము :- ఎటుల పతులసేవ యొనర్చుచు వారి సమీపమున నిలబడు పతివ్రతలైన గురుపత్నులు అగ్నిహోత్రాది కర్మలందు స్థిరబుద్ధి యుంచుచున్నారో,అటులనే వివాహానంతరము బ్రహ్మచారిణులగు కన్యలు, బ్రహ్మచారులు[నగు యువకులు]పరస్పరము ప్రవర్తించ వలయును. [౨౩౩]

౨౩౪. సోమరాజన్నిత్యస్య మేధాతిథి ర్ఋషిః, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః, శృణోత్విత్యస్యార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ గురుజనః క్షత్రియం శిష్యం ప్రజా జనాంశ్చ ప్రత్యుపదిశతి.

క్షత్రియశిష్యునికి, ప్రజలకు గురువుపదేశించుచున్నాడు.

సోమ రాజన్విశ్వా స్త్వం ప్రజా౽ఉపావరోహ విశ్వాస్త్వాం ప్రజా౽ఉపావరోహంతు। శృణోత్వగ్నిః సమిధా హవమ్మే శృణ్వంత్వాపో ధిషణాశ్చ దేవీః శ్రోతా గ్రావాణో విదుషో న యజ్ఞఀ శృణోతు దేవః సవితా హవమ్మే స్వాహా॥

సోమ, రాజన్, విశ్వాః, త్వమ్, ప్రజా+ఇతి ప్రజాః, ఉపావరోహేత్యుప అవరోహ, విశ్వాః, త్వామ్, ప్రజా+ఇతి ప్రజాః, ఉపావరోహన్త్విత్యుప అవరోహంతు, శృణోతు, అగ్నిః, సమిధేతి సమ్, ఇధా, హవమ్, మే, శృణ్వంతు, ఆపః, ధిషణాః, చ, దేవీః, శ్రోత, గ్రావాణః, విదుషః, న, యజ్ఞమ్, శృణోతు, దేవః, సవితా, హవమ్, మే, స్వాహా॥ ॥౬.౨౬॥

పదార్థః :-(సోమ)ప్రశస్తైశ్వర్యయుక్త(రాజన్)సర్వోత్కృష్టగుణైః ప్రకాశమానః (విశ్వాః) సర్వాః(త్వమ్)(ప్రజాః)పాలనీయాః(ఉపావరోహ)ఉపవర్తస్వ(విశ్వాః)సర్వాః (త్వా) పితర మపత్యానీవ(ప్రజాః)సుఖాయ ప్రజననీయాః(ఉపావరోహంతు)సముపాశ్రయన్తు(శృణోతు)(అగ్నిః) పావకః(సమిధా)సమిధేవ(హవమ్)అర్జనమ్(మే)మమ(శృణ్వన్తు)(ఆపః)శుభగుణ కర్మవ్యాప్తాః (ధిషణాః)ధృష్టా వాచో యాసాం తాః ధిషణేతి వాఙ్నా. నిఘం. ౧.౧౧.(చ)పక్షాంతరే(దేవీః)విదుష్యః (శ్రోత) శృణుత. అత్ర తస్య స్థానే తప్ తనప్ తనథనాశ్చ. అ. ౭. ౧. ४౫. అనేన తవాదేశః. ద్వ్యచోతస్తిఙ ఇతి దీర్ఘః. బహులం ఛందసీతి శ్నులోపశ్చ.(గ్రావాణః)సదసద్వివేచకా విద్వాంసః. గ్రావాణ ఇతి పదనామసు పఠితమ్. ని. ౫. ౩. (విదుషః) (న) ఇవ(యజ్ఞమ్)(శృణోతు)(దేవః) విద్యాప్రకాశితః. (సవితా) ఐశ్వర్యవాన్ (హవమ్) (మే)మమ(స్వాహా)స్తుతియుక్తా వాగ్యథా తథా. అయం మంత్రః శత ३.౭.౬-౨४. వ్యాఖ్యాతః.

అన్వయః :— హే సోమ రాజంస్త్వం పితేవ విశ్వాః ప్రజా ఉపావరోహ. త్వాం విశ్వాః ప్రజా అపత్యానీవోపావరోహంతు.భవాన్ సమిధాగ్నిరివ మే మమ ప్రజాజనస్య హవం శృణోతు. యా ఆపో ధిషణా దేవీః దేవ్యః పత్న్యశ్చ మాతరమివ స్త్రీన్యాయం శృణ్వంతు. హే గ్రావాణః

స్తావకా విద్వాంసః సభాసదో యూయం మమ హవం శ్రోత.దేవః సవితా భవాన్ విదుషో యజ్ఞం న ఇవ మే మమ హవం స్వాహా శృణోతు.

భావార్థః :— రాజా ప్రజాశ్చ పరస్పరానుమత్యా సర్వాన్ రాజ్యవ్యవహారాన్ పాలయేయు రితి,

పదార్థము :-(సోమ)శ్రేష్ఠైశ్వర్యవంతుడా! (రాజన్) సమస్తోత్కృష్ట గుణములచే ప్రకాశించు సభాధ్యక్షా! నీవు పితృతుల్యుడవై (విశ్వాః ప్రజాః)సకల ప్రజలను(ఉపారోహ) నికటస్థుడవై రక్షించుము.(త్వా)నిన్ను(ప్రజా)ప్రజలు పుత్రతుల్యులై(ఉపావరోహంతు) ఆశ్రయించుదురు గాక! ఓ సభాధ్యక్షా!(సమిధా)ప్రదీప్తమొనర్చు పదార్థముతో(అగ్నిః) సర్వగుణసంపన్నమగు నగ్ని యెటుల ప్రకాశితమగునో నీవును అటులనే (మే హవమ్) నా ప్రగల్భవాణిని(శృణోతు)ఆకర్ణించి న్యాయముతో ప్రకాశించుము. మరియు (ఆపః) సమస్త గుణములందు వ్యాప్తురాలును(ధిషణాః)విద్యాబుద్ధి యుక్తురాలును(దేవీః)ఉత్తమోత్తమ గుణములతో ప్రకాశవతియునగు నీ పత్నియు మాతృతుల్యముగ స్త్రీలన్యాయమును(శృణ్వంతు)ఆలకించునుగాక! (గ్రావాణః) సదసద్వివేచకులైన విద్వాంసులగు సభాసదులారా! మీరు మా యభిప్రాయములను మా మాటలలో(శ్రోత) వినుడు. మరియు(దేవః)విద్యాప్రకాశితుడు,(సవితా)ఐశ్వర్యవంతుడునగు సభాపతి(విదుషః) విద్వాంసుల(యజ్ఞమ్ న)యజ్ఞమువలె(మే)మా ప్రజల(హవమ్)నివేదనమును (స్వాహా) ప్రశంసాయుతమగు వాక్కువలె(శృణోతు)వినును గాక!

భావార్థము :- రాజు, ప్రజలు పరస్పరసమ్మతి మీద సమస్తరాజ్య వ్యవహారములను నెరవేర్చుచుందురుగాక ! [౨౩౪]

౨౩౫.దేవీరాప ఇత్యస్య మేధాతిథి ఋషిః, ఆపో దేవతాః,నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః, స్వరః

పున రేతే కథం వర్తేర న్నిత్యుపదిశ్యతే.

రాజు ప్రజలెటుల ప్రవర్తించవలయును ? ఇందు చెప్పబడినది.

దేవీరాపో అపాన్నపాద్యో వఽఊర్మి ర్హవిష్యఽఇంద్రియావాన్ మదింతమః। తం దేవేభ్యో దేవత్రా దత్త శుక్రపేభ్యః। యేషా మ్భాగ స్థ స్వాహా॥౬.౨౭

దేవీః, ఆపః, అపామ్, నపాత్, యః, వః, ఊర్మిః,హవిష్యః,ఇంద్రియావానితీంద్రియవాన్, మదింతమ+ఇతి మదింతమః, తమ్, దేవేభ్యః, దేవత్రేతి దేవత్రా, దత్త, శుక్రపేభ్య+ఇతి శుక్రపేభ్యః, యేషామ్, భాగః, స్థ, స్వాహా

పదార్థః :— (దేవీః) దివ్యాః (ఆపః) ఆప్తాః ప్రజాః (అపాం నపాత్) అవినశ్వరః (యః) (వః) యుష్మాకమ్ (ఊర్మిః) జలతరంగ ఇవ. (హవిష్యః) హవిర్భ్యో హితః(ఇంద్రియావాన్)

ప్రశస్తానీంద్రియాణి యస్మిన్ సః(మదింతమః)మదయతీతి మదీ సో౽తిశయితః. నాద్ ఘస్య.అ. ౮.౨.౧౭. ఇతి మదిన శబ్దాన్నుమాగమః (తమ్) (దేవేభ్యః) విద్వద్భ్యః(దేవత్రా)దివ్యాన్ గుణాన్ (దత్త) (శుక్రపేభ్యః) శుక్రం వీర్యం రక్షన్తి. తేభ్యః (యేషామ్) (భాగః) (స్థ) (స్వాహా)అయం మంత్రః శత. ౩.౭,౪.౫. వ్యాఖ్యాతః.

అన్వయః :— హే ఆపో దేవీ ర్దేవ్యః ప్రజా యూయం రాజభక్తా స్థ భవత, శుక్రపేభ్యో దేవేభ్యో యేషాం వో యుష్మాకమపాం నపాదూర్మిరివేంద్రియావాన్ మదింతమో హవిష్యో భాగో ఽస్తి తం స్వాహా సద్వాచా గృహ్ణీత. తథా రాజాదయః సభ్యాః జనా దేవత్రా దివ్యాన్ భోగాన్ యుష్మభ్యం ప్రదదతి తథైతేభ్యో యూయమపి దత్త.

భావార్థః :— ప్రజాజనానా మిధ ముచిత ముత్కృష్టగుణం సభాపతిం మత్వా రాజపాలనాయ కరం దత్వా న్యాయం ప్రాప్నుయు రితి.

పదార్థము :-(ఆపః)శ్రేష్ఠగుణములందు వ్యాప్తులును(దేవీః)శుభకర్మలచే ప్రకాశ వంతులునునగు ప్రజలారా! మీరు[రాజభక్తులు]రాజును సేవించువారు(స్థ)కండు.(శుక్ర పేభ్యః)శరీరముయొక్కయు, ఆత్మయొక్కయు పరాక్రమమును రక్షించువారును(దేవే భ్యః)దివ్యగుణయుక్తులునగు విద్వాంసులకై(అపాం నపాత్)జలములయొక్క నాశరహి తమును, స్వాభావికమునునగు(ఊర్మిః)జలతరంగములవలె ప్రజారక్షకమును (ఇంద్రియా వాన్)ప్రశంసనీయమైన ఇంద్రియములు కలిగినదియు(మదింతమః) ఆనంద ప్రదాతయు (హవిష్యః)భోగయోగ్యములగు పదార్థములతో నిష్పన్నమైనదియునగు(యేషామ్వః) ఏ మీ బలవంతులగు విద్వాంసులయొక్క(యః భాగః)ఏ భాగమున్నదో మీరందరు(తమ్) దానిని(స్వాహా) ఆదరపూర్వకముగా గ్రహణమొనర్చుడు. ఎటుల రాజాది సభ్యజనులు (దేవత్రా) దివ్యభోగముల [మీకు] నిచ్చుచున్నారో అటులనే మీరును వారికి (దత్త) ఆనందమొసగుడు.

భావార్థము :- పరస్పరము సమ్మతియొనర్చుకొని, ఉత్కృష్టగుణయుక్తుడగు సభాపతిని రాజుగా స్వీకరించి, రాజ్యపాలనమునకై కప్పముగట్టి న్యాయమును పొందుట ప్రజలకు తగిన కార్యము. [౨౩౫]

౨౩౬. కార్షిరసీత్యస్య మేధాతిథి ఋషిః, ప్రజా దేవతాః, నిచృదార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః,

**అథాధ్యాపకో జనః ప్రతిజనం కిం కిముపదిశేదిత్యుచ్యతే.**

మానవున కధ్యాపకుడేమేమి యుపదేశించవలయును ?

కార్షి రసి సముద్రస్య త్వా క్షిత్యా ఉన్నయామి।
సమాపో అద్భి రగ్మత సమోషధీభి రోషధీః॥ ॥౬.౨౮.॥

కార్షిః, అసి, సముద్రస్య. త్వా, అక్షిత్యై, ఉత్, నయామి, సమ్, ఆపః, అద్భిరిత్యత్+భిః, అగ్మత, సమ్, ఓషధీభిః, ఓషధీః.

పదార్థః :–(కార్షిః)కర్షతి హలేన భూమిమితి. ఇఞ్ వపాదిభ్య ఇతీఞ్.(అసి)(సముద్రస్య) అంతరిక్షస్య. సముద్ర ఇత్యంతరిక్షనామసు పఠితమ్. నిఘం. ౧.౩౦. (త్వా) త్వామ్ (అక్షిత్యై) (ఉత్) ఉత్కృష్టే (నయామి) (సమ్) (ఆపః) జలాని (అద్భిః) జలై రేవ (అగ్మత) ప్రాప్నుత. లోడర్థే లుఙ్(సమ్)(ఓషధీభిః)సోమాదిభిః(ఓషధీః)అయం మన్త్రః శత. ౩.౭.౪-౩౧.వ్యాఖ్యాతః.

అన్వయః :– హే వైశ్యజన ! త్వం కార్షి రసి త్వాం సముద్రస్యాక్షిత్యై సమున్నయామి. సర్వే యూయం యజ్ఞశోధితాభి రద్భి రేవాప ఓషధీభి రోషధీః సమగ్మత.

భావార్థః :– క్షేత్రాదిభూమిషు నానౌషధయో జాయంత. ఓషధీభి రగ్నిహోత్రాదయో యజ్ఞా యజ్ఞై రంతరిక్షం జలపరమాణుభిః పూర్ణం భవతీతి హేతో ర్విద్వాంసో నిర్బుద్ధిజనాన్ క్షేత్రాదిషు నయన్తి. కుతస్తే విద్యా మభ్యసితుం సమర్థా ఏవ న భవంతీతి.

పదార్థము :- ఓ వైశ్యజనుడా! నీవు(కార్షిః అసి)హలముతో[భూమిని] దున్నుటకు యోగ్యుడవు.(త్వా)నిన్ను(సముద్రస్య)అంతరిక్షముయొక్క(అక్షిత్యై) పరిపూర్ణత్వమునకై (ఉత్ యామి)చక్కగా ఉత్కర్షనుగొలుపుచున్నాను. మీరందరు(అద్భిః)యజ్ఞశోధిత జలములచే(ఆపః)జలములను (ఓషధీభిః) ఓషధులచే నోషధులను (సమ్ అగ్మత) ప్రాప్తమొందుడు.

భావార్థము :- క్షేత్రాది స్థానములందనేకౌషధములు మొలకలెత్తును. ఓషధులచే నగ్నిహోత్రాది యజ్ఞములు, యజ్ఞములచే పరిశుద్ధమైన జలపరమాణువులు ఊర్ధ్వమునకు చేరుటచే వానిచే నాకాశము పరిపూర్ణమగుచున్నది. ఈ కారణముచే విద్వాంసులు విద్యాభ్యాస మొనరించుటకు సమర్థులు కాజాలని నిర్బుద్ధిజనులను క్షేత్రాదుల కార్యములందు వినియోగించుచున్నారు. [౨౩౮]

---

౨౩౯ యమగ్న ఇత్యస్య మధుచ్ఛందా ఋషిః, అగ్ని ర్దేవతా, భురిగార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

**అథ స విద్వాంసం కిమాహేత్యుపదిశ్యతే.**

అతడధ్యాపకునితో నేమనునది **యుపదేశించబడినది.**

యమగ్నే పృత్సు మర్త్యమవా వాజేషు యఞ్జునాః।

స యన్తా శాశ్వతీ రిషః స్వాహా॥ ॥౬.౨౯.॥

యమ్, అగ్నే, పృత్స్వితి పృత్సు, మర్త్యమ్, అవాః, వాజేషు, యమ్, జునాః, సః, యన్తా, శశ్వతీః, ఇషః, స్వాహా॥

భావార్థః :- సర్వేషాం విదుషాం విదుషీనాం చ యోగ్యతాఽస్తి. సర్వేభ్యో బాలకేభ్యః కన్యాభ్యశ్చానిశం విద్యాదానం రాజ్ఞాం ధనినాం చ పదార్థైః స్వజీవికాం చ కుర్యుః. తే రాజానో ధనినశ్చ విద్యాసుశిక్షాభ్యాం ప్రవీణా భూత్వా స్వస్యాధ్యాపకేభ్యో విద్వద్భ్యో విదుషీభ్యశ్చ ధనాది పదార్థాన్ దత్వా తేషాం సేవనం కుర్యుః. మాతా పితరా వష్టవార్షిక కుమారాన్ కుమారీశ్చ విద్యాబ్రహ్మచర్య సేవన శిక్షాకరణాయ విద్వద్భ్యో విదుషీభ్యశ్చ సమర్పయేతామ్. తేఽధ్యేతారో విద్యాగ్రహణే చేతో నిత్యమభిదద్యు స్తథాఽధ్యాపకాశ్చ విద్యాసుశిక్షాదానే నిత్యం ప్రయతేరన్.

పదార్థము :- (చర్షణీధృతః) మనుష్యులకు పుష్టిని, సంతుష్టిని కలిగించు వారలారా ! (ఓమాసః) ఉత్తమోత్తమ గుణములచే రక్షించువారలారా ! (విశ్వేదేవాసః) సమస్త విద్వాంసులారా ! మీరు (దాశ్వాంసః) ఉత్కృష్టజ్ఞానమునిచ్చుచు (దాశుషః) దానమొనర్చు నుత్తమజనులయొక్క (సుతమ్) సత్కార్యముల నొనర్చి ఐశ్వర్యమును పొందు పుత్రునికి(ఆగత) సన్ముఖులగుడు. ఉక్తదానశీల పురుషునియొక్క అధ్యయన శీలుడవగు బాలకా ! నీవు (ఉపయామ గృహీతః అసి) చదివించు నియమములచే గ్రహించబడినవాడవు. కావున (త్వా) నిన్ను (విశ్వేభ్యః దేవేభ్యః) సమస్త విద్వాంసులను సేవించుటకై ఆజ్ఞాపించుచున్నాను. ఏలయన(తే)నీక (ఏషః)ఈ విద్య మఱియు శ్రేష్ఠమైన శిక్షల సంగ్రహము(యోనిః) కారణమైయున్నది. కావున(త్వా)నీకు(విశ్వేభ్యః దేవేభ్యః)సకల విద్వాంసులనుండి విద్యను, సుశిక్షను గఱపించుచున్నాను.

భావార్థము:-విద్వాంసులు విదుషీమతల్లులందఱు చేయవలసిన కర్తవ్యము. సకల బాలబాలికలకు వారు నిరంతరము విద్యాదానమొనర్చవలయును. రాజులయొక్కయు ధనికుల యొక్కయు ధనాది పదార్థములద్వారా తమజీవిత యాత్రను గడుపుకొనవలయును, ఆ రాజులును ధనికులును తమకు విద్యగఱపు విద్యాసుశిక్షలచే ప్రవీణులగు విద్వాంసులకును, విదుషీమతల్లులకును ధనాద్యుత్తమ పదార్థముల నిచ్చి వారి సేవ యొనర్చవలయును. తల్లిదండ్రులెనిమిదేండ్లప్రాయముగల బాలురను, బాలికలను విద్యాభ్యాసముకొఱకు,బ్రహ్మచర్య సేవనమునకై సుశిక్షకై విద్వాంసులకును,విదుషీమతల్లులగు మహిళలకును అప్పజెప్పవలయును.వారును విద్యాగ్రహణమునందు నిత్యము మనసునుంచవలయును. చదివించువారును విద్యా సుశిక్షలనొసగుటయందే నిత్యము ప్రయత్న మొనర్చెదరు గాక! [౩౩]

౩౪. విశ్వేదేవాస ఆగత ఇత్యస్య గృత్సమద ఋషిః, విశ్వేదేవా దేవతాః, ఆద్యస్యార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః, ఉపయామ ఇత్యస్య నిచృదార్ష్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

అథ ప్రత్యహ మధ్యాపన విషయమాహ.

ప్రతిదినము చదివించు యోగ్యతను గురించి చెప్పెను.

విశ్వే దేవాస ఆగత శృణుతామ ఇమꣳ హవమ్।

ఏదం బర్హి ర్నిషీదత।

ఉపయామ గృహీతోఽసి విశ్వేభ్య స్త్వా దేవేభ్య ఏష తే యోని ర్విశ్వేభ్యస్త్వా దేవేభ్యః॥                    ౭.౩౪॥

విశ్వే+దేవాసః, ఆ, గత, శృణుత, మే, ఇమమ్, హవమ్, ఆ, ఇదమ్, బర్హిః, ని, సీదత, ఉపయామ గృహీత ఇత్యుపయామ+గృహీతః,అసి,విశ్వేభ్యః, త్వా, దేవేభ్యః, ఏషః, తే, యోనిః, విశ్వేభ్యః, త్వా, దేవేభ్యః.

పదార్థః :-(విశ్వే)సర్వే(దేవాసః)విద్వాంసః(ఆ)(గత)ఆగచ్ఛత(శృణుత)అత్ర సంహితాయామితి దీర్ఘః(మే)మమ విద్యార్థినః(ఇమమ్)వక్ష్యమాణమ్(హవమ్)స్తుతివాదమ్(ఆ) సమంతాత్ (ఇదమ్)అస్మాభిర్దత్తమ్(బర్హిః)ఉత్తమమాసనమ్(ని)నితరామ్ (సీదత) ఆధ్వమ్ (ఉపయామ గృహీతః) (అసి)(విశ్వేభ్యః)సమస్తేభ్యః(త్వా)త్వామ్(దేవేభ్యః)అధ్యాపకేభ్యః(ఏషః)సకలవిద్యాసంగ్రహః(తే) తవ(యోనిః)గృహమ్(విశ్వేభ్యః)(త్వా)త్వామ్ (దేవేభ్యః) అయం మంత్రః శత. ౪.౨.౩-౨౬. వ్యాఖ్యాతః.

అన్వయః:-హే పూర్వమంత్ర ప్రతిపాదిత గుణకర్మస్వభావా విశ్వే దేవాసో యూయ మస్మాకం నికటమాగతా, అస్మాభి ర్దత్తమిదం బర్హిరాసన మానిషీదత. మే మమేమం హవం శృణుత. గృహస్థాః స్వపుత్రాదీన్ ప్రత్యేవం బ్రూయు ర్యత స్త్వముపయామ గృహీతోఽసి. తస్మాత్త్వా త్వాం విశ్వేభ్యో దేవేభ్యః ప్రయచ్ఛేమ.తే తవైష యోని రస్తి త్వా త్వాం విశ్వేభ్యో దేవేభ్యోఽధికాం విద్యాం దాపయేమ.

భావార్థః :-ఏకే విద్వాంసోఽన్వహం విద్యార్థినః పాఠయేయు రపరే విపశ్చితో విద్వాంసః ప్రతిమాసమధ్యేతౄణాం పరీక్షణం చ కుర్యుః. తత్కృత్వాఽధ్యాపకాః ప్రతీత తీవ్రబుద్ధీన్ పరిశ్రమం కుర్వతోఽధ్యేతౄనతిశ్రమేణ పాఠయేయురితి.

పదార్థము :- పూర్వమంత్ర ప్రతిపాదితగుణకర్మ స్వభావయుక్తులారా! (విశ్వేదేవాసః)సమస్త విద్వాంసులారా! మీరు మా సమీపమునకు(ఆగత)విచ్చేయుడు. మఱియు మేమొసగునట్టి(ఇదం బర్హిః)ఈ ఆసనముమీద(ఆ నిషీదత)యథావకాశముగ, సుఖపూర్వకముగా విరాజమానులుగండు.(మే)నాయొక్క (హవమ్) స్తుతియుక్తమగు వాణిని (శృణుత)వినండి. గృహస్థులు తమ పుత్రాదులతో నిటుల జెప్పవలయును:-ఓ పుత్రరత్నమా! నీవు (ఉపయామ గృహీతోఽసి) విద్వాంసులచే గ్రహించబడియున్నావు. కావున (త్వా)మేము నిన్ను (విశ్వేభ్యః దేవేభ్యః)సుశిక్షావిద్యలను గఱపు విద్వాంసులకు అప్పజెప్పితిమి.ఏలయన(ఏషః)ఈ సమస్తవిద్యాసంగ్రహము(తే)నీకు(యోనిః)ఇంటితో సమానము. కనుకనే(త్వా)నీకు (విశ్వేభ్యః దేవేభ్యః) సకల విద్వాంసులచే విద్యను గఱపింప గోరుచున్నాము.

**భావార్థము:-** విద్వాంసులిటులొనర్పుట యుచితము ఏమనగా:- ప్రతిదినము విద్యార్థులకు చదువుజెప్పవలయును. పరమ విద్వాంసులైన పండితులు వారి పరీక్షయు ప్రతిమాసమున నొనర్చవలయును. ఆ పరీక్షవలన తీక్ష్ణబుద్ధియుక్తులుగను, పరిశ్రమయొన ర్చు వారుగను ప్రతీతులగు విద్యార్థులకు అత్యంత పరిశ్రమతో చదువు నేర్పవలయును

---

౫౧౦. ఇంద్ర ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః, ఉపయామ ఇత్యస్యార్ష్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

**అథ రాజాఽధ్యాపనాది వ్యవహారరక్షణం కథం కుర్యాదిత్యుపదిశ్యతే.**

రాజు అధ్యాపనాదివ్యవహారముల రక్షణమెటు లొనర్చవలయునను విషయమిందు జెప్పబడినది.

ఇంద్ర మరుత్వ ఇహ పాహి సోమం యథా శర్యాతే అపిబః సుతస్య। తవ ప్రణీతీ తవ శూర శర్మన్నావివాసంతి కవయః సుయజ్ఞాః। ఉపయామ గృహీతోఽసీంద్రాయ త్వా మరుత్వత ఏష తే యోని రింద్రాయ త్వా మరుత్వతే॥ ౭.౩౫॥

ఇంద్ర, మరుత్వః, ఇహ, పాహి, సోమమ్, యథా, శార్యాతే, అపిబః, సుతస్య, తవ, ప్రణీతీ, ప్రణీతీతి ప్ర+నీతీ, తవ, శూర, శర్మన్, ఆ, వివాసంతి, కవయః, సుయజ్ఞా ఇతి సు+యజ్ఞాః, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, ఇంద్రాయ, త్వా, మరుత్వతే, ఏషః, తే, యోనిః, ఇంద్రాయ, త్వా, మరుత్వతే.

పదార్థః:-(ఇంద్ర) సర్వవిఘ్నవిదారకః సకలైశ్వర్యయుక్తః సమ్రాట్ (మరుత్వః) మరుతః ప్రశస్తా ధర్మసంబద్ధాః ప్రజా యస్య తత్సమ్బుద్ధౌ (ఇహ)అస్మిన్ సంసారే(పాహి)రక్ష.(సోమమ్) సకలగుణైశ్వర్యకల్యాణ కర్మాధ్యయనాధ్యాపనాఖ్యం యజ్ఞమ్. (యథా) శర్యాభిరంగులీభి ర్నిర్వ ృత్తాని కర్మాణి శార్యాణి తాన్యతతి వ్యాప్నోతి స శార్యాత స్తస్మిన్, శర్యా ఇత్యంగులి నామసు పఠితమ్ నిఘం. ౨. ౫.(అపిబః)(సుతస్య)(తవ)(పణీతీ)ప్రకృష్టాం నీతిమ్. అత్ర సుపాం సు లుగితి పూర్వసవర్ణాదేశః(తవ) (శూర) ధర్మవిరోధిహింసకః (శర్మన్) న్యాయగృహే! అత్ర సుపాం సు లుగితి ఙేర్లుక్. న ఙి సంబుద్ధ్యోః అ. ౮.౨.౮. ఇతి న లోపాభావః.(ఆ) (వివాసంతి) పరిచరంతి వివాసతీతి పరిచరణకర్మసు పఠితమ్ నిఘం. ౩.౫.(కవయః) మేధావినః. కవిరితి మేధావి నామసు పఠితమ్ నిఘం. ౩.౧౫ (సుయజ్ఞాః) శోభనోఽధ్యయనాధ్యాపనాఖ్యో యజ్ఞో యేషాం త ఇవ. (ఉప యామ గృహీతః)(అసి)(ఇంద్రాయ)పరమైశ్వర్యాయ(త్వా)త్వామ్(మరుత్వతే) ప్రజాసంబంధాయ.

అత్ర సంబంధే మతుప్ ఝయ ఇతి మస్య వత్వమ్.(ఏషః) (తే) (యోనిః)(త్వా) (మరుత్వతే) అయం మంత్రః శత. ౪.౨.౩.౧౩. వ్యాఖ్యాతః.

అన్వయః :- హే మరుత్వః ఇంద్రః త్వమిహ యథా శార్యాతే సుతస్యాపిబ స్తథా సోమ మ్పాహి. హే శూర తవ శర్మన్ న్యాయగృహే సుయజ్ఞా ఇవ కవయ స్తవ ప్రణీతి మావివాసంతి. యత స్త్వముపయామగృహీతోఽసి. తస్మాత్త్వామింద్రాయ మరుత్వతే వయం సేవేమహి. తే తవైష విద్యాప్రచారో యోని ర స్త్యత స్త్వామింద్రాయ మరుత్వతే మన్యామహే.

భావార్థః :- సర్వేషాం విదుషా ముచితమ స్తి న్యాయరాజసభాజ్ఞాం నోల్లంఘేరన్, తథై తే రాజసభాసభ్యజనా అపి విద్వదాజ్ఞాం నోల్లంఘేరన్. యః సర్వోత్కృష్ట స్తం సభాపతిం కుర్యుః.స సభాపతి రుత్తమనీత్యా సర్వరాజ్యప్రబంధం కుర్యాత్.

పదార్థము :-(ఇంద్ర)సకల విఘ్నములను దూరమొనర్చువాడా! సకల సంపద్యుక్తా! తేజస్వీ!(మరుత్వః)ప్రశంసనీయ ధర్మయుక్తముగ ప్రజలపాలించు సభాపతీ! రాజన్! నీవు(ఇహ)ఈలోకమున(యథా)ఎటుల(శార్యాతే)స్వపాణిపాదములపరిశ్రమచే నిష్పన్నమగు వ్యవహారమునందు(సుతస్య) అభ్యాసమొనర్చిన విద్యారసమును(అపిబః)పానమొనర్చియున్నావో, అటులనే(సోమమ్)సకల సుగుణములను, ఐశ్వర్యములను, సుఖములను నొసగు పఠనపాఠనరూప యజ్ఞమును (పాహి) పాలించుము.

(శూర) ధర్మవిరోధులను దండించువాడా! (తవ)నీయొక్క(శర్మన్)రాజ్యగృహమున (సుయజా) బాగుగా అధ్యయనాధ్యాపనము లొనర్చు విద్వాంసులవలె(కవయః) బుద్ధిమంతులు (తవ) నీయొక్క (ప్రణీతి) ఉత్తమనీతిని(అవివాసంతి) సేవించుచున్నారు.

ఓ శూరుడా ! నీవు (ఉపయామ గృహీతః అసి) ప్రజాపాలనాది నియమములచే స్వీకరించబడియున్నావు. కావున (త్వా)నిన్ను (ఇంద్రాయ) పరమైశ్వర్యముకొఱకును (మరుత్వతే) ప్రజాసంబంధము కొఱకును మేము కోరుచున్నాము.

(తే) నీకు (ఏషః) యీ విద్యాప్రచారము (యోనిః) గృహతుల్యమై యున్నది. కావున (త్వా) నిన్ను (ఇంద్రాయ) పరమైశ్వర్యముకొఱకును,(మరుత్వతే)ప్రజాపాలన సంబంధములకొఱకును స్వీకరించుచున్నాము.

భావార్థము :- న్యాయాధీశుల, న్యాయసభల ఆజ్ఞను ఎన్నటికి ఉల్లంఘించకుండుట విద్వాంసుకెటుల ఉచితమో అటులనే రాజసభా సభాసదులుకూడ వేదజ్ఞులగు విద్వాంసుల ఆజ్ఞను ఉల్లంఘించకూడదు. సర్వగుణోత్కృష్టుడగువానినే సభాపతిగా నొనర్పవలయును. ఆ సభాపతియు నుత్తమనీతితో సమస్త రాజ్యప్రబంధముల నొనర్చవలయును. [౨౮౦]

౨౮౧. మరుత్వంతమిత్యస్య విశ్వామిత్ర ఋషిః, ప్రజాపతి ర్దేవతా, విరాడార్షీ త్రి　ఛందః, ధైవతః స్వరః. ఉపయామేత్యస్య ద్వితీయభాగస్యార్షీ, తృతీయస్య సామ్న్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పునా రాజప్రజాకృత్యమాహ.

రాజు ప్రజలు ఏమిచేయవలయుననను విషయమిందు మరల చెప్పబడినది.

మరుత్వంతం వృషభం వావృధాన మకవారిం దివ్యꣳ శాసమింద్రమ్।
విశ్వాసాహ మవసే నూతనాయోగ్రꣳసహోదా మిహతꣳహువేమ।
ఉపయామగృహీతోఽసీంద్రాయ త్వా మరుత్వత ఏష తే యోని రింద్రాయ త్వా మరుత్వతే ఉపయామగృహీతోఽసి మరుతాం త్వౌజసే॥ ౭.౩౬॥

మరుత్వంతమ్, వృషభమ్, వావృధానమ్, వవృధానమితి వవృధానమ్, అకవారిమిత్యకవారిమ్, దివ్యమ్, శాసమ్, ఇంద్రమ్, విశ్వాసాహమ్,విశ్వసహమితి, విశ్వ+సహమ్, అవసే, నూతనాయ, ఉగ్రమ్, సహోదామితి సహః+దామ్,ఇహ, తమ్, హువేమ, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, ఇంద్రాయ, త్వా, మరుత్వతే, ఏషః, తే, యోనిః, ఇంద్రాయ, త్వా, మరుత్వతే, ఉపయామ గృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, మరుతామ్, త్వా, ఓజసే.

పదార్థః :-(మరుత్వంతమ్)ప్రశస్తప్రజాయుక్తమ్(వృషభమ్)సర్వోత్తమమ్ (వావృధానమ్) అతిశయేన శుభగుణకర్మసు వర్ధమానమ్(అకవారిమ్)కౌతి ధర్మముపదిశతీతి కవో న కవోఽకవోఽధర్మాత్మా తస్యారిః శత్రుస్తమ్(దివ్యమ్)శుద్ధమ్(శాసమ్)శాసితారమ్(ఇంద్రమ్)ఐశ్వర్యవంతమ్ (విశ్వాసాహమ్) విశ్వాన్సర్వాన్ సహతే తమ్. అత్ర విశ్వపూర్వాత్ సహధాతోః ఛందసి సహః అ. ౩.౧.౬౩. ఇతి ణ్విః. అన్యేషామపి దృశ్యత ఇతి దీర్ఘశ్చ(అవసే)రక్షణాద్యాయ(నూతనాయ)నవీనాయ(ఉగ్రమ్)ప్రచండ పరాక్రమమ్(సహోదామ్)యః సహో బలం దదాతి తమ్ (ఇహ) అస్యాం ప్రజాయామ్(హువేమ)స్వీకుర్వీమహి(ఉపయామ గృహీతః) సర్వనియమోపనియమసామగ్రీసహితః(అసి)(ఇంద్రాయ)పరమైశ్వర్యాయ(త్వా)త్వామ్(మరుత్వతే)ప్రశంసితప్రజాయుక్తాయ ఏషః(తే)(యోనిః)(ఇంద్రాయ)(త్వా)(మరుత్వతే)(ఉపయామ గృహీతః)(అసి) మరుతామ్ (త్వా) త్వామ్ (ఓజసే)బలాయ. అయం మంత్రః శత. ౪.౨.౭.౧౪. వ్యాఖ్యాతః.

అన్వయః :- కవయో వయం నూతనాయావసే మరుత్వంతం వృషభం వావృధాన మకవారి ద్దివ్యం విశ్వాసాహ ముగ్రం సహోదాం శాసం తం పూర్వోక్తమింద్రం హువేమ. హే ముఖ్యసభాసద యతస్త్వముపయామ గృహీతోఽసి.తస్మాత్త్వా త్వాం మరుత్వత ఇంద్రాయ యతస్తే త్వైష యోని రస్త్యత స్త్వా మరుత్వత ఇంద్రాయ యతస్త్వముపయామ గృహీతోఽసి. తస్మాన్మరుతా మోజసే బలాయ చ త్వా త్వాం హువేమ.

భావార్థః :- అత్ర పూర్వస్మా న్మంత్రాత్(కవయః) ఇత్యేతత్పదమనువర్తతే. ప్రజాజనానాం యోగ్యతాఽస్తి. యః సర్వోత్తమః సకలగుణయుక్తో విపశ్చిచ్ఛూరవీరో భవేత్తం సభాయా ముఖ్య

కర్మణి సంస్థాపయేయుః. స సభాయాం నియుక్తః సత్యన్యాయధర్మయుక్తరాజ్యకర్మణా ప్రజాబలం వర్ధయేత్.

పదార్థము :-(కవయః)పూర్వోక్త విద్వాంసులమైన మేము (నూతనాయ)కొత్త కొత్త(అవసే)రక్షాది గుణములకొరకు (మరుత్వంతమ్) ప్రశంసనీయ ప్రజాయుక్తుడును (వృషభమ్) సర్వోత్తముడును (వావృధానమ్) అత్యంతశుభగుణయుక్తుడును, కర్మల యందున్నతిని పొందినవాడును(అకవారిమ్) ధర్మవిరోధులగు దుష్టులనందఱిని నివారించువాడును(దివ్యమ్)శుద్ధుడును(విశ్వాసాహమ్) సర్వసహనశీలుడును (ఉగ్రమ్) ప్రచండ పరాక్రమయుక్తుడును.(సహోదామ్)[బల] సహాయ [మొసగగలవాడును] (శాసమ్) అందరికి శిక్షనొసగువాడును (తమ్ ఇంద్రమ్) పూర్వోక్త పరమైశ్వర్యయుక్తుడగు నా సభాపతిని నిమ్నవిధముగ (హువేమ) స్వీకరించెదము గాక !

ఓ ముఖ్యసభాసదుడా ! రాజన్ ! నీవు (ఉపయామ గృహీతః అసి) సమస్త బృహన్నియమములతోను, లఘునియమములతోను సహితుడవు, కావున (త్వా) నిన్ను (మరుత్వతే) ప్రశంసనీయుడును, ప్రజాయుక్తుడును (ఇంద్రాయ) పరమైశ్వర్యవంతుడును నగు సభాపతిగా స్వీకరించుచున్నాము (ఏషః)ఈసభయందు న్యాయమొనర్చు కార్యము (తే)నీకు(యోనిః)గృహతుల్యము కావున(త్వా)నిన్ను (మరుత్వతే ఇంద్రాయ) ఉత్తమ ప్రజాయుక్తుడగుటకొరకును, అత్యంతైశ్వర్యమును పాలించుటకును, వృద్ధియొనర్చుటకును స్వీకరించుచున్నాము. నీవు(ఉపయామగృహీతః అసి) ఉక్తనియమోప నియమములతో సంయుక్తుడవైయున్నావు. కావున(మరుతామ్) ప్రజల (ఓజసే) బలము పెంచుట కొఱకు.(త్వా)నిన్ను గ్రహించుచున్నాము.

భావార్థము :- ఈ మంత్రమునందు పూర్వమంత్రమునుండి(కవయః)అను పదము అనువృత్తమైనది. సర్వోత్తముడును, సమస్త విద్యలలో నిపుణుడును, సకల శుభగుణ యుక్తుడును, విద్వాంసుడును, శూరవీరుడును నగు వానినే సభయొక్క ముఖ్యకార్యమునందు స్థాపించుట ప్రజలకు ఉచితము. సకల సభాకార్యములందు స్థాపించబడిన ఆ సభాపతి సత్య, న్యాయ, ధర్మ యుక్తములగు రాజ్యకార్యములచే ప్రజలయుత్సాహమును పెంపొందించవలయును. [౩౮]

---

౩౭. సజోషేత్యస్య విశ్వామిత్ర ఋషిః, ప్రజాపతి ర్దేవతా, ఆద్యస్య నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ఉపయామేత్యస్య ప్రాజాపత్యా త్రిష్టుప్ ఛందసీ, ధైవతః స్వరః.

**అథ సేనాపతి కృత్య మాహ.**

సేనాపతి కార్యమీ మంత్రమందు చెప్పబడినది.

సజోషా ఇన్ద్ర సగణో మరుద్భిః సోమం పిబ వృత్రహా శూర విద్వాన్।

జహి శత్రూఁ॥ రపమృధో నుదస్వాథాభయం కృణుహి విశ్వతో నః ఉపయామగృహీతో ఽసీన్ద్రాయ త్వా మరుత్వత ఏష తే యోనిరింద్రాయ త్వా మరుత్వతే॥ ౭.౩౭॥

సజోషా+ఇతి సజోషాః, ఇంద్ర, సగణ ఇతి స+గణః, మరుద్భిరితి మరుత్+భిః, సోమమ్, పిబ, వృత్రహేతి వృత్ర+హా, శూర, విద్వాన్, జహి, శత్రూన్, అప, మృధః, నుదస్వ, అథ, అభయమ్, కృణుహి, విశ్వతః, నః, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, ఇంద్రాయ, త్వా, మరుత్వతే, ఏషః, తే, యోనిః, ఇంద్రాయ, త్వా, మరుత్వతే.

పదార్థః :-(సజోషాః)సమానం జోషః ప్రీతిర్యస్య(ఇంద్ర)సర్వసుఖధారకః సేనాపతేః (సగణః)గణేన స్వజనసేనాపరికరేణ సహితః(మరుద్భిః)వాయుభిరివ(సోమమ్)సకల పదార్థరసమ్(పిబ) (వృత్రహా)యో వృత్రం మేఘం హంతి స వృత్రహా సూర్య స్తద్వత్(శూర)శత్రువినాశకః నిర్భయ (విద్వాన్)సకల విద్యావేత్తా(జహి)వినాశయ(శత్రూన్) సత్యన్యాయవిరోధే ప్రవర్తమానాన్ (అప) దూరీకరణే(మృధః)మర్దంతి ఉందంతి పరసుఖైః స్వమనాంసి యేషు తాన్ సంగ్రామాన్(నుదస్వ) ప్రేరయ.(అథ)అనంతరమ్(అభయమ్)(కృణుహి)(విశ్వతః)సర్వతః(నః)అస్మభ్యమ్(ఉపయామ గృహీతః)సేనా సునియమ స్వీకృతః(అసి)(ఇంద్రాయ)పరమైశ్వర్య ప్రాపకాయ యుద్ధాయ (త్వా) త్వామ్(మరుత్వతే)ప్రశస్తాని మరుదస్త్రాణి విద్యంతే యస్మిం స్తస్మై(ఏషః) సేనాకృత్యవ్యవహారః (తే)(యోనిః)(ఇంద్రాయ)(త్వా)(మరుత్వతే)

అన్వయః :- హే ఇంద్ర! సేనాపతే! శూర! యత స్త్వముపయామ గృహీతోఽస్యతో మరుత్వత ఇంద్రాయ త్వా త్వాముపదిశామి కిమిత్యపేక్షాయామాహ. తే తవైష యోని రస్త్యతస్త్వాం మరుత్వత ఇంద్రాయ ప్రయతమాన మంగీకరోమి. సజోషా సగణ స్త్వం మరుద్భి ర్వృత్రహా ఇవ సోమం పిబ. తం పీత్వా విద్వాన్ సన్ శత్రూ ఞ్జహి.అథ మృధోఽపనుదస్వ నోఽస్మభ్యం విశ్వతో ఽభయం కృణుహి.

భావార్థః:- అత్రోపమాలంకారః. యథా జీవః ప్రేమ్ణా స్వస్య మిత్రస్య వా శరీరస్య రక్షణం కరోతి,తథా రాజా ప్రజాం పాలయేత్ యథా వా సూర్యో వాయు విద్యుద్భ్యాం సంహత్య, మేఘాన్నిహత్య, జలేన సర్వస్మై సుఖం దధాతి,తథా రాజా యుద్ధసాధనాని సంపాద్య శత్రూన్నిహత్య, ప్రజాయై సుఖం దద్యాత్ ధర్మాత్మభ్యోఽభయం దుష్టేభ్యో భయం చ దద్యాత్.

పదార్థము :- ఈశ్వరుడు చెప్పుచున్నాడు :- (ఇంద్ర) సకల సుఖములను ధారణ మొనర్చువాడా!(శూర) శత్రువుల నాశనమొనర్చుటలో నిర్భయుడా! నీవు (ఉపయామ గృహీతః అసి) శ్రేష్ఠమైన సైనికనియములచే స్వీకరించబడి యున్నావు కావున (మరు

త్వతే)ప్రశంసనీయమగు వాయువుయొక్క అస్త్రవిద్యగలదియు (ఇంద్రాయ) పరమైశ్వర్యమును సమకూర్చునదియునగు యుద్ధమునకై (త్వా) నీకుపదేశించుచున్నాను. (తే) నీకు(ఏషః) ఈ సేనాధికారము(యోనిః)ఇష్టసుఖదాయకమైయున్నది. కనుక(మరుత్వతే ఇంద్రాయ)ఉక్తసమరమునకై యత్నమొనరించు నిన్ను అంగీకరించుచున్నాను.మఱియు (సజోషాః) అందరితో సమానప్రీతి చూపువారును (సగణః) నీ మిత్రజనులతోసహా నీవు (మరుద్భిః)ఎటుల పవనముచే(వృత్రహా) మేఘ జలములను ఛిన్న భిన్నమొనర్చు సూర్యుడు(సోమమ్)సమస్త పదార్థముల రసమును ఆకర్షించుచున్నాడో అటులనే సర్వపదార్థముల రసమును(పిబ)సేవించుము. మఱియు[దానిని సేవించి](విద్వాన్) జ్ఞానయుక్తుడవైన నీవు (శత్రూన్) సత్యన్యాయములకు విరుద్ధముగా ప్రవృత్తులైన దుష్టవిరోధులను (జహి)హతమార్చుము. (అథ) దీనియనంతరము (మృధః) దుష్టులెందు పరుల సుఖముచే స్వమనములను ప్రసన్నపఱచుకొందురో అట్టిస గ్రామములను(అప నుదస్వ)తొలగించుము. (నః)మాకు(విశ్వతః)సకలదిశలనుండి(అభయమ్ కృణుహి)భయరహితముగ నొనర్చుము

భావార్థము :- ఈ మంత్రమునందుపమాలంకారమున్నది. జీవమెటుల ప్రేమతో తన మిత్రులను, రక్షించి స్వశరీరమును రక్షించుకొనుచున్నదో అటులనే రాజు ప్రజలను పాలించవలయును. సూర్యుడెటుల వాయువిద్యుత్తులతోపాటు మేఘమును భేదించి జలముచే నందఱికి సుఖమిచ్చుచున్నాడో, అటులనే రాజును యుద్ధసామగ్రిని సమకూర్చుకొని, శత్రువులను నిర్మూలనమొనర్చి,ప్రజలకు సుఖమును, ధర్మాత్ములకు నిర్భయమును, దుష్టులకు భయమును కలుగజేయును గాక! [౩౮-౩]

౩౯- మరుత్వానిత్యస్య విశ్వామిత్ర ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ఉపయామేత్యస్య ప్రాజాపత్యా త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ సభాధ్యక్షోపదేశః క్రియతే.

సభాపతికీ మంత్రమందుపదేశ మొనర్చబడినది.

మరుత్వాఀ౩॥ ఇన్ద్ర వృషభో రణాయ పిబా సోమ మనుష్వధ మ్మదాయ।
ఆసించస్వ జఠరే మద్ధ్వఽ ఊర్మిం త్వఀ రాజాఽసి ప్రతిపత్సుతానామ్।
ఉపయామగృహీతోఽసీంద్రాయ త్వా మరుత్వత ఏష తే యోని రింద్రాయ త్వా మరుత్వతే॥ ౭.౩౯॥

మరుత్వాన్, ఇన్ద్ర. వృషభః, రణాయ, పిబ, సోమమ్, అనుష్వధమ్, అనుస్వధమిత్యను+స్వధమ్, మదాయ, ఆ, సించస్వ, జఠరే, మద్ధ్వః,ఊర్మిమ్,త్వమ్,

రాజా, అసి, ప్రతిపదితి ప్రతి+పత్,సుతానామ్,ఉపయామగృహీత ఇత్యుపయామ+ గృహీతః, అసి, ఇంద్రాయ. త్వా, మరుత్వతే, ఏషః, తే, యోనిః,ఇంద్రాయ,త్వా, మరుత్వతే.

పదార్థః :-(మరుత్వాన్)ప్రశస్తా మరుతః ప్రజాః సేనా వా విద్యంతే యస్య సః (ఇంద్ర శత్రుజిత్ (వృషభః)శరీరాత్మబలైశ్వర్యయుక్తః(రణాయ)సంగ్రామాయ. రణ ఇతి సంగ్రామనామసు పఠితమ్ నిఘం. ౨.౧౭.(పిబ)అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః.(సోమమ్)సోమాద్యోషధి సమూహమ్ (అనుష్వధమ్) సర్వేషు పక్వాన్నేష్వనుకూలమ్. అత్ర విభక్త్యర్థేఽవ్యయీభావః సమాసః. (మదాయ)హర్షాయ(ఆసించస్వ)(జఠరే)ఉదరే(మధ్వః)(ఊర్మిమ్) లహరీమ్(త్వమ్) సభాసేనాపతిః (రాజా)ప్రకాశమానః(అసి) (ప్రతిపత్) పద్యతే విచార్యతే యోఽర్థవిషయః స పత్, పతం పతం ప్రతీతి ప్రతిపత్(సుతానామ్)సుసంస్కారేణ నిష్పాదితానామన్నానామ్(ఉపయామ గృహీతః) రాజనియమైః స్వీకృతః(అసి)(ఇంద్రాయ)పరమైశ్వర్యప్రాపకాయ రణాయ (త్వా)(మరుత్వతే) ప్రశస్తాని మరుదస్త్రాణి విద్యంతే యత్ర తస్మై(ఏషః)(తే)(యోనిః)(ఇంద్రాయ)రాజైశ్వర్యాయ(త్వా)(మరుత్వతే)ప్రజాపాలన సంబద్ధాయ.

అన్వయః :- హే ఇంద్ర! యతస్త్వముపయామ గృహీతోఽసి. తస్మాద్వయం త్వా త్వాం మరుత్వత ఇంద్రాయ నియోజయామో యతస్తే తవైష యోని రస్తి తస్మాత్త్వా త్వాం మరుత్వత ఇంద్రాయ బ్రూమః. కిం తత్తదాహ త్వం ప్రతిపద్రాజా ప్రత్యేకకర్మణి ప్రకాశమానో మరుత్వాన్ వృషభోఽస్త్యతో రణాయానుష్వధం మదాయ సోమం పిబ. సుతానా మన్నానామ్మధ్వ ఊర్మిం జఠర ఆసించస్వ.

భావార్థః :- అత్రోపమాలంకారః. సభా సేనాపత్యాది మనుష్యా ఉత్తమోత్తమాన్ పదార్థాన్ భుక్త్వా శరీరాత్మబలం సంపాద్య శత్రూన్ విజిత్య న్యాయవ్యవస్థయా సర్వాన్ పాలయేయురితి.

పదార్థము :-(ఇంద్ర)శత్రువులను జయించు నో సభాపతీ! నీవు(ఉపయామగృహీతః అసి)రాజనియమములచే స్వీకరించబడియున్నావు. కావున మేము నిన్ను (మరుత్వతే)శ్రేష్ఠమగు శస్త్రాస్త్రములను ప్రయోగించబడునట్టిదియు(ఇంద్రాయ)పరమైశ్వర్యమును పొందింపజేయునదియునగు యుద్ధమునకై నియమించుచున్నాము. కనుక(తే)(ఏషః) ఈ యుద్ధము నీ పరమైశ్వర్యమునకు(యోనిః)కారణమైయున్నది. కావుననే(త్వా)నీకు (మరుత్వతే ఇంద్రాయ)ఆ యుద్ధముకోసము చెప్పుచున్నాము. ఎందుకనగా నీవు(ప్రతిపత్)ప్రతి పెద్దపెద్ద ఆలోచనలతోకూడిన కార్యములందు(రాజా) ప్రకాశవంతుడవు (మరుత్వాన్)ప్రశంసనీయ ప్రజాయుక్తుడవు(వృషభః)అత్యంతశ్రేష్ఠుడవు. కావుననే(రణాయ) యుద్ధముకొఱకు,(మదాయ) ఆనందముకొఱకు (అనుష్వధమ్) ప్రతిభోజనమునందును (సోమమ్)సోమలతాది పుష్టినొసగు రసములను(పిబ)త్రాగుము. (సుతానామ్) ఉత్తమ సంస్కారములచే తయారైన అన్నములయొక్క(మధ్వః ఊర్మిమ్) మధురరసపు తరంగమును(జఠరే)స్వకీయ ఉదరమునందు(ఆసించస్వ)బాగుగా స్థాపించుము.

భావార్థము :-ఈ మంత్రమునందుపమాలంకారమున్నది. సభ సేనాపతులు మొ॥ మానవులు ఉత్తమోత్తమ భోజనపదార్థముల నారగించి, శరీరాత్మలను బలపరచి, శత్రువులను జయించి న్యాయవ్యవస్థచే సకల ప్రజలను పాలించుచుండవలయును. [౭౮౩]

౭౮౪. మహానిత్యస్య భరద్వాజ ఋషిః, ప్రజాసేనాపతీ ర్దేవతా, ఆద్యస్య భురిక్ పంక్తి శ్ఛందః, పంచమః స్వరః, ఉపయామేత్యస్య సామ్నీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథేశ్వరః స్వగుణానాహ.

ఈశ్వరుడు స్వగుణముల నీమంత్రమందు చెప్పెను.

మహాఀ౭॥ ఇంద్రో నృవదా చర్షణిప్రా ఉత ద్విబర్హాఽఅమినః సహోభిః।
అస్మద్ర్యగ్ వావృధే వీర్యాయోరుః పృథుః సుకృతః కర్తృభిర్భూత్।
ఉపయామ గృహీతోఽసి మహేంద్రాయ త్వైష తే యోని ర్మహేంద్రాయ త్వా॥

మహాన్, ఇంద్రః, నృవదితి నృ+వత్, ఆ, చర్షణిప్రా+ఇతి చర్షణి+ప్రాః, ఉతః, ద్విబర్హా ఇతి ద్వి+బర్హాః, అమినః, సహోభిరితి సహః+భిః,అస్మద్ర్యక్, వావృధే, వవృధ ఇతి వవృధే, వీర్యాయ, ఉరుః, పృథుః, సుకృత ఇతి సు+కృతః, కర్తృభిరితి కర్తృ+భిః, భూత్, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, మహేంద్రాయేతి మహా+ఇంద్రాయ, త్వా, ఏషః, తే,యోనిః, మహేంద్రాయేతి మహా+ఇంద్రాయ, త్వా. ౭.౩౯॥

పదార్థః :-(మహాన్)సర్వోత్కృష్టః పూజ్యతమశ్చ(ఇంద్రః)అత్యుత్కృష్టైశ్వర్యః(నృవత్) న్యాయశీలైర్మనుష్యై స్తుల్యః(ఆ)(చర్షణిప్రాః)చర్షణీన్ మనుష్యాన్ ప్రాతి సుఖైః ప్రపూరయతి సః (ఉత)అపి(ద్విబర్హాః)ద్వే బర్హసీ వ్యావహారిక పారమార్థిక వృద్ధికరే విజ్ఞానే యస్య సః. ద్విబర్హా ఇతి పదనామసు పఠితమ్. నిఘం. ౪.౩.(అమినః) అనుపమోఽతుల పరాక్రమః. అమినోఽమిత మాత్రో మహాన్ భవత్యమితో వా నిరు. ౬.౧౬.(సహోభిః)బలైః(అస్మద్ర్యక్) అస్మానఞ్చతి సర్వజ్ఞతయా జానాతి.(వావృధే)వర్ధతే వర్ధయతి వా.(వీర్యాయ)పరాక్రమాయ(ఉరుః) బహుః (పృథుః) విస్తీర్ణః(సుకృతః)శోభనం కృతం క్రియతే యేన సః(కర్తృభిః)సుకర్మకారిభి ర్జీవైః సహ(భూత్) భవతి. అత్రాడభావః(ఉపయామ గృహీతః)యోగాభ్యాసేన స్వీకర్తుం యోగ్యః(అసి) (మహేంద్రాయ) అనుత్తమాయైశ్వర్యాయ (త్వా) (ఏషః)(తే)(యోనిః)(మహేంద్రాయ) (త్వా)త్వామ్. అయం మంత్రః శత. ౪. ౨. ౭-౧౮.

అన్వయః:- హే భగవన్! జగదీశ్వర! యత స్త్వముపయామ గృహీతోఽసి, తస్మాన్మహేంద్రాయ త్వా వయముపాస్మహే. ఉతాపి యత స్తే తవైష యోని రస్తి, తస్మాత్త్వాం మహేంద్రాయ వయం సేవామహే. యో మహాన్ నృవదాచర్షణిప్రా ద్విబర్హా అస్మద్ర్యక్ అమినః ఉగ్రః పృథుః కర్తృభిః సహ సుకృత ఇంద్రోఽభూత్. తమేవాశ్రితః సర్వో జనః సహోభిః సహ వీర్యాయ వావృధే.

భావార్థః :- అత్రోపమాలంకారః. ఈశ్వరమనాశ్రిత్య కశ్చిదపి పురుషః ప్రజాః పాలయితుం న శక్నోతి. యథేశ్వరః శాశ్వతం న్యాయమాశ్రిత్య సర్వాన్ ప్రాణినః సుఖయతి, తథైవ రాజాపి సర్వాన్ తర్పయేత్.

పదార్థము:-ఓ భగవంతుడా! జగదీశ్వరా! నీవు(ఉపయామ గృహీతః అసి)యోగాభ్యాసముచే గ్రహణమొనర్చ యోగ్యుడవు. కావున(మహేంద్రాయ) అత్యంతోత్తమైశ్వర్యమునకై మేము(త్వా)నిన్ను ఉపాసించుచున్నాము.[ఏషః తే](యోనిః)ఈ నీయుపాసన మాకు కళ్యాణకారణమైయున్నది. కావున (త్వా) నిన్ను (మహేంద్రాయ) పరమైశ్వర్యప్రాప్తికై మేము సేవించుచున్నాము. ఎవడు (మహాన్) సర్వోత్తముడును, అత్యంత పూజ్యుడును (నృవత్) మనుష్యునివలె (ఆ చర్షణిప్రాః) సకల మానవులను సుఖముతో బాగుగా పరిపూర్ణులుగా నొనర్చువాడును (ద్విబర్హాః) వ్యవహార జ్ఞానమును పరమార్థజ్ఞానమును వృద్ధిపఱచు నుభయజ్ఞానములచే సంయుక్తుడును. (అస్మద్ర్యక్) ప్రాణులన్నిటిని, మమ్మును సర్వజ్ఞత్వముతో నెరుగువాడును (అమినః) అతుల పరాక్రమ యుక్తుడును (కర్తృభిః) సుకర్మల నాచరించు జీవుల [తో సహా] (సుకృతః) [శోభన కర్మల నొనరించు వాడును] సుకర్మల నాచరించువారి వలె గ్రహించబడినవాడును (ఇంద్రః) అత్యంతోత్కృష్టైశ్వర్యవంతుడును నైయున్నాడో వానినే ఆశ్రయించి మేమందరము(సహోభిః)మంచిమంచి బలములతో(వీర్యాయ) పరమోత్తమ బలప్రాప్తికై (వావృధే) దృఢోత్సాహయుక్తుల మగుచున్నాము.

భావార్థము:- ఈ మంత్రమునందుపమాలంకారమున్నది. ఈశ్వరుని నాశ్రయించకుండ నేమనుష్యుడును ప్రజలను రక్షించజాలడు. ఈశ్వరుడెటుల సనాతన న్యాయము నాశ్రయించి సకలజీవులకు సుఖము చేకూర్చుచున్నాడో అటులనే రాజును ప్రజలకు తన న్యాయవ్యవస్థచే సుఖము చేకూర్చవలయును. [౨౮]

౨౯. మహానింద్ర ఇత్యస్య వత్స ఋషిః, ప్రజాపతి ర్దేవతా, ఆర్షీ గాయత్రీ చ్ఛందః. ఉపయామేత్యస్య విరాడార్షీ గాయత్రీ చ్ఛందః షడ్జః స్వరః.

పున రీశ్వరగుణా ఉపదిశ్యంతే.

మరల నీశ్వరగుణము లీమంత్రమందుపదేశించ బడినవి.

మ॒హాꣳ॥ ఇన్ద్రో॒ య ఓజ॑సా ప॒ర్జన్యో॑ వృష్టి॒మాꣳ॥ ఇ॑వ।

స్తోమై ర్వత్సస్య వావృధే।
ఉపయామ గృహీతోऽసి మహేంద్రాయ త్వైష తే యోనిర్మహేంద్రాయ త్వా॥

మహాన్, ఇంద్రః, యః, ఓజసా, పర్జన్యః, వృష్టిమాన్ ఇవ, వృష్టిమానివేతి వృష్టిమాన్+ఇవ, స్తోమైః, వత్సస్య వావృధే,వవృధ ఇతి వవృధే,ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, మహేంద్రాయేతి మహా+ఇంద్రాయ, త్వా, ఏషః, తే. యోనిః, మహేంద్రాయ, త్వా. ౭.४०॥

పదార్థః :-(మహాన్) మహాగుణకర్మ స్వభావః (ఇంద్రః) అఖిలైశ్వర్యః (యః) (ఓజసా) అనంతబలేన(పర్జన్యః)మేఘః(వృష్టిమానివ)బహ్వ్యో వృష్ట్యో విద్యంతే యస్మింస్తద్వత్.(స్తోమైః) స్తుతిభిః(వత్సస్య)యో వదతి తస్య(వావృధే)అత్యంతం వర్ధతే(ఉపయామ గృహీతః) యమనియమాదిభి ర్యోగాంగైః సాక్షాత్ స్వీకృతః.(అసి)(మహేంద్రాయ)యోగజాయ మహైశ్వర్యాయ(త్వా) త్వామ్(ఏషః)(తే)తవ(యోనిః)నిమిత్తమ్(మహేంద్రాయ)మోక్షప్రాపకాయ మహైశ్వర్యాయ (త్వా) త్వామ్.

అన్వయః :- హే అనాదిసిద్ధ మహాయోగిన్।సర్వవ్యాపిన్నీశ్వర యతస్త్వం యోగిభిరుపయామ గృహీతోऽసి. తస్మాత్త్వా త్వాం మహేంద్రాయోపశ్రయామహే. యతస్తే తవైష యోగో యోనిరస్త్యత స్త్వా త్వాం మహేంద్రాయ వయం ధ్యాయేమ. యో మహాన్ వృష్టిమాన్ పర్జన్య ఇవ వత్సస్య స్తోమై రోజసేంద్రః సుఖవర్షకో భవతి తం విదిత్వా యోగీ వావృధేऽత్యంతం వర్ధతే.

భావార్థః :- యథా మేఘో వృష్టిసమయే స్వజలసమూహేన సర్వాన్ పదార్థాన్ తర్పయన్ సన్ వర్ధయతి. తథైవేశ్వరో యోగారాధనతత్పరం యోగిన మభివర్ధయతి.

పదార్థము :- అనాదిసిద్ధా! మహాయోగీ! సర్వవ్యాపకా! ఈశ్వరా! నీవు యోగులచే(ఉపయామ గృహీతః అసి) యమనియమాది యోగాంగముల ద్వారాస్వీకరించబడినవాడవు. కావున మేము (త్వా)నిన్ను(మహేంద్రాయ) యోగముచే ప్రకటితమగు శ్రేష్ఠైశ్వర్యమునకై ఆశ్రయించుచున్నాము (తే)నీయొక్క(ఏషః) యీ యోగము మా కళ్యాణమునకు(యోనిః)నిమిత్తమైయున్నది. కావున (త్వా) నిన్ను (మహేంద్రాయ) మోక్షమొసగు నైశ్వర్యముకొఱకు ధ్యానించుచున్నాము. (యః) (మహాన్) ఏ పెద్ద పెద్ద గుణకర్మ స్వభావములుగలవాడు, (వృష్టిమాన్ పర్జన్య ఇవ) బాగుగా వర్షించు మేఘమువలె (వత్సస) స్తుతికర్తయొక్క (స్తోమైః) స్తుతులద్వారా (ఓజసా) అనంత బలముతో ప్రకాశితుడై [సుఖమును వర్షింపజేయు]చున్నాడో ఆ ఈశ్వరునెఱిగి యోగి (వావృధే) అత్యంతోన్నతిని పొందుచున్నాడు.

భావార్థము :- మేఘమెటుల వర్షాకాలమున తన జలసమూహామువలన సర్వ పదార్థముల తృప్తపఱచి యున్నతిపరచుచున్నదో అటులనే ఈశ్వరుడును యోగాభ్యాస మొనర్చు సమయమున యోగాభ్యాసమొనర్చు యోగిపుంగవుని యోగమును అత్యంత వృద్ధిపఱచుచున్నాడు. [౪౦-౪౧]

౪౧-౬ ఉదుత్య మిత్యస్య ప్రస్కణ్వ ఋషిః,సూర్యో దేవతా,భురిగార్షీ గాయత్రీ ఛందః,షడ్జః స్వరః.
అథ సూర్యదృష్టాంతేనేశ్వరస్య గుణా ఉపదిశ్యంతే.

ఈశ్వరుని గుణములు సూర్యునితో నుపమించుచు చెప్పబడినవి.

ఉదు త్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః।

దృశే విశ్వాయ సూర్యం స్వాహా॥ ౭.౪౧॥

ఉత్, ఊఀ+ఇత్యూఀ, త్యమ్, జాతవేదసమితి జాత+వేదసమ్,దేవమ్, వహంతి, కేతవః, దృశే, విశ్వాయ, సూర్యమ్, స్వాహా.

పదార్థః :-(ఉత్)క్రియాయోగే(ఉ)వితర్కే-(త్యమ్)అముమ్.(జాతవేదసమ్) జాతాని భూతాని సర్వాణి వేదజాతాన్ మూర్తిమతః పదార్థాన్ విందత ఇతి వా తమ్.౪.౧.ఇమం మంత్రం యాస్కముని రేవం నిర్వక్తి:- జాతవేదాః కస్మాజ్జాతాని వేదజాతాని వైనం విదు ర్జాతే జాతే విద్యత ఇతి వా జాతవిద్యో వా జాతప్రజ్ఞానో యత్తజ్జాతః పశూనవిందతేతి తజ్జాతవేదసో జాతవేదస్త్వ మితి. నిరు. ౭.౧౯.(దేవమ్)దివ్యగుణసంపన్నమ్(వహంతి)ప్రాపయంతి(కేతవః) ప్రజ్ఞానాని కేతు రితి ప్రజ్ఞానామసు పఠితమ్. నిఘం.౩.౯.(దృశే)ద్రష్టుమ్. దృశే విఖ్యే చ అ.౩.౪.౧౧.(విశ్వాయ) సర్వార్థాయ(సూర్యమ్)యః స్రియతే విజ్ఞాప్యతే వా విద్వై ర్విద్వద్భిశ్చ తమ్.(స్వాహా)సత్యయా వాచా.

ఇమం మంత్రం యాస్కముని రేవం వ్యాచష్టే :- ఉద్వహంతి తం జాతవేదసం రశ్మయః కేతవః సర్వేషాం భూతానాం దర్శనాయ.సూర్యమితి కమన్యమాదిత్యాదేవ మవక్ష్యత్.నిరు.౧౨.౧౫.

అయం మంత్రః శత. ౪.౫.౨. వ్యాఖ్యాతః.

అన్వయః :- యథా కిరణా విశ్వాయ దృశే జాతవేదసం త్యం సూర్యం దేవముద్వహంతీవ విదుషః కేతవః స్వాహాన్యాన్ మనుష్యాన్పరం బ్రహ్మ ప్రాపయంతి.

భావార్థః :- యథా ప్రాణిభ్యః కిరణాః సూర్యం ప్రకాశయంతి. తథా మనుష్యస్య ప్రజ్ఞానా నీశ్వరం ప్రాపయంతి.

పదార్థము:-ఎటుల కిరణములు(విశ్వాయ)సమస్త జగత్తుయొక్క ప్రయోజనము నకును(దృశే)చూచుటకును, గ్రహించుటకును(జాతవేదసమ్) ఉత్పన్నమైన సకలపదార్థ ముల నెఱుగువాడును, మూర్తిమంతములగు పదార్థములను పొందువాడును. (త్యం సూర్యం దేవమ్)దివ్యగుణ సంపన్నుడునగు నా సూర్యుని (ఉ) (ఉత్ వహంతి) నిశ్చయ

ముగ ప్రాప్తమొనరించుచున్నవో,అటులనే విద్వాంసునియొక్క(కేతవః)ప్రకృష్టజ్ఞానము మఱియు (స్వాహా) సత్యోపదేశములు మానవునకు పరబ్రహ్మప్రాప్తి కలిగించుచున్నవి.

భావార్థము :- ఎటుల ప్రాణులకొరకు సూర్యకిరణములు సూర్యుని ప్రకాశపఱచుచున్నవో అటులనే మనుష్యునియొక్క యనేక విద్యాయుక్త బుద్ధులును దేవుని ప్రకాశ పఱచుచున్నవి. [౪౧]

---

౪౨. చిత్రం దేవానా మిత్యస్య కుత్స ఋషిః, సూర్యో దేవతా,
భురిగార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

**పునరర్థ మేవేశ్వరస్య గుణా ఉపదిశ్యంతే.**

అటులనే ఈశ్వర గుణములను మరల నీ మంత్ర మందుపదేశించెను.

చిత్రం దేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః। ఆ ప్రా ద్యావాపృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ స్వాహా॥ ౭.౪౨॥

చిత్రమ్, దేవానామ్, ఉత్, అగాత్, అనీకమ్, చక్షుః, మిత్రస్య,వరుణస్య, అగ్నేః, ఆ, అప్రాః, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, అంతరిక్షమ్, సూర్యః, ఆత్మా, జగతః, తస్థుషః, చ, స్వాహా.

పదార్థః:-(చిత్రమ్)అద్భుతమ్(దేవానామ్)చక్షురాదీనామివ విదుషామ్.(ఉత్)ఉద్గమనే(అగాత్) ప్రాప్నోతి(అనీకమ్) బలవత్తరం సైన్యమివ ప్రసిద్ధమ్. అనితి జీవయతి సర్వాన్ ప్రాణినః సః. అని హృషిభ్యాం కిచ్చ ఉ. ౪. ౧౬. అనేన ఈకన్ ప్రత్యయః(చక్షుః)దర్శకమ్.(మిత్రస్య)సఖ్యుః ప్రాణస్య వా(వరుణస్య)శ్రేష్ఠస్యోదానస్య వా అగ్నేః విద్యుతః(ఆ)సమంతాత్(అప్రాః)యః ప్రాతి పిపర్తి. అత్ర లడర్థే లుజ్(ద్యావాపృథివీ)భూమి వియతౌ(అంతరిక్షమ్)సర్వన్నిర్గత మనంత మాకాశమ్(సూర్యః)స్వయం ప్రకాశః (ఆత్మా) అతతి సర్వత్ర వ్యాప్నోతి (జగతః,జంగమస్య (తస్థుషః) స్థావరస్య(చ)జీవానాం సముచ్చయే(స్వాహా)సత్యయా క్రియయా.

ఇమం మంత్రం యాస్కముని రేవం సమాచష్టే:-

చాయనీయం దేవానాముదగమదనీకం ఖ్యానం మిత్రస్య వరుణస్యాగ్నేశ్చాపుపూరద్ ద్యావా పృథివ్యౌ చాంతరిక్షం చ మహత్వేన తేన సూర్య ఆత్మా జఙ్గమస్య చ స్థావరస్య చ నిరు.౧౨.౧౬. అయం మంత్రః శత. ౪. ౩. ౧.౧౦. వ్యాఖ్యాతః.

అన్వయః:-హే మనుష్యా! యుష్మాభిః సూర్యః స్వాహా దేవానాం మిత్రస్య వరుణస్యాగ్నేశ్చిత్రమనీకం చక్షురుదగాత్. జగత స్తస్థుషశ్చాత్మా సన్,ద్యావాపృథివీ అంతరిక్ష మా ప్రా ఇవ యో జగదీశ్వరోఽస్తి స ఏవ సతత ముపాసనీయః.

భావార్థః :- యతః పరమేశ్వర ఆకాశ ఇవ సర్వత్ర వ్యాప్తః, సవితేవ స్వయంప్రకాశః, ప్రాణ ఇవ సర్వాన్తర్యామ్యస్త్యతః సర్వేభ్యో జీవేభ్యః సత్యాసత్యవిజ్ఞాపకోఽస్తి. యస్య పరమేశ్వరస్య జ్ఞీప్సా భవేత్. స యోగమభ్యస్య స్వాత్మన్యేవ తం ద్రష్టుం శక్నోతి నాన్యత్రేతి.

పదార్థము :- ఓ మనుష్యులారా! (సూర్యః)ప సవిత(స్వాహా)సత్యక్రియచే(దేవానామ్) నేత్రాదులవలె విద్వాంసులయొక్కయు (మిత్రస్య) మిత్రునియొక్కయు, లేక ప్రాణముయొక్కయు (వరుణస్య) శ్రేష్ఠపురుషునియొక్కయు, ఉదానవాయువుయొక్కయు,(అగ్నేః) అగ్నియొక్కయు (చిత్రమ్) అద్భుతమును (అనీకమ్) బలవత్తరమగు సేనవలె ప్రసిద్ధమునునగు(చక్షుః)ప్రభావమునుచూపు గుణనికరమును(ఉత్ అగాత్)బాగుగా పొందుచున్నాడో, మఱియు నెవడు(జగతః)జంగమ ప్రాణులయొక్కయు, (తస్థుషః) స్థావర పదార్థములయొక్కయు (ఆత్మా) ఆత్మతుల్యుడై (ద్యావాపృథివీ) ఆకాశభూములను(అంతరిక్షమ్)అంతరిక్షమును(ఆ)అన్నివిధములు(అప్రాః)వ్యాప్తుడై ఉన్నాడో, ఆ పరమాత్మనే నిరంతర ముపాసించుట మీకు ఉచితము.

భావార్థము :- పరమేశ్వరుడు ఆకాశమువలె సర్వత్రవ్యాపకుడు, సూర్యునివలె స్వయం ప్రకాశమానుడు మరియు సూత్రాత్మయగు వాయువువలె సర్వాంతర్యామియునై యున్నాడు. కావున సకలజీవులకు సత్యాసత్యములను బోధించువాడై యున్నాడు. ఎవరికైనను పరమేశ్వరుని తెలుసుకొన నిచ్ఛ గలుగుచో నతను యోగాభ్యాసమొనర్చి తన యాత్మయందు చూడగలుగును గాని అన్యత్ర గాంచజాలడు. [౪౨]

౪౩. అగ్నే నయేత్యస్యాంగిరస ఋషిః, అంతర్యామీ జగదీశ్వరో దేవతా,
భురిగార్షీ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.
అథైతదీశ్వర ప్రార్థనా మాహ.

ఈశ్వర ప్రార్థన నీమంత్రమందు చెప్పెను.

అగ్నే నయ సుపథా రాయేఽఅస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ స్వాహా॥

అగ్నే, నయ, సుపథేతి సు+పథా, రాయే, అస్మాన్, విశ్వాని, దేవ, వయునాని, విద్వాన్, యుయోధి, అస్మత్, జుహురాణమ్, ఏనః, భూయిష్ఠామ్, తే, నమ, ఉక్తిమితి నమః+ఉక్తిమ్, విధేమ. ౭.౪౩॥

పదార్థః:- (అగ్నే)సర్వేషాం ప్రకాశకః(నయ)ప్రాపయ(సుపథా)యోగమార్గేణ(రాయే)యోగసిద్ధయే(అస్మాన్)యోగినః(విశ్వాని)అఖిలాని(దేవ)యోగప్రద(వయునాని)యోగవిజ్ఞానాని(విద్వాన్) యో వేత్తి సర్వం యోగం సః(యుయోధి) వియోజయ (అస్మత్) అస్మాకం యోగానుష్ఠాతౄణాం సకాశాత్ (జుహురాణమ్)అస్మదంతఃకరణస్య కౌటిల్యమ్ (ఏనః)దుష్కృతాత్మక మపరాధమ్.(భూయిష్ఠామ్)భూయసీమ్(తే)తవ యోగోపదేష్టుః పరమగురోః(నమ ఉక్తిమ్) నతి పురఃసరాం స్తుతిం (విధేమ) కుర్యామ (స్వాహా) సత్యయా స్వకీయయా వాచా వేదవాచా వా. అయం మంత్రః శత. ౪.౩.౧-౧౨. వ్యాఖ్యాతః,

**అన్వయః :-** హే అగ్నే! త్వం రాయే అస్మాన్ విశ్వాని వయునాని నయ. యతో వయం స్వాహా తే భూయిష్ఠాం నమ ఉక్తిం విధేమ. హే దేవ! విద్వంస్త్వం కృపయా జుహురాణ మేన శ్చాస్మద్యుయోధి.

భావార్థః:-న కశ్చిదపి పురుషః పరమాత్మనః సత్యప్రేమభక్త్యా వినా యోగసిద్ధిం ప్రాప్నోతి. యశ్చేత్థంభూతో యోగబలేన పరమేశ్వరం స్మరతి, తస్మై స దయాలుః శీఘ్రం యోగసిద్ధిం దదాతి.

పదార్థము :-(అగ్నే) సమస్త జనుల యంతఃకరణమున ప్రకాశమును కలిగించు నోపరమేశ్వరా ! నీవు (సుపథా) సత్యవిద్యాధర్మయోగములచే యుక్తమగు మార్గము ద్వారా(రాయే)యోగసిద్ధికొఱకు (అస్మాన్)మాకు(విశ్వాని వయునాని)సమస్తయోగ విజ్ఞానములను(నయ)సమకూర్చుము. అటుల పొంది మేము (స్వాహా)మా సత్యవాణితో లేక వేదవాణితో(తే)నీయొక్క(నమ ఉక్తిమ్)నమస్కార పూర్వకస్తుతిని(భూయిష్ఠామ్) (విధేమ) అధికముగా చేయుదుముగాక ! (దేవ) యోగవిద్యనొసగు నో యీశ్వరా ! (విద్వాన్)యోగముయొక్క సకల గుణములను,క్రియలను ఎరుగువాడవగు నీవు దయ యుంచి(జుహురాణమ్)మా యంతఃకరణముయొక్క కుటిలత్వములగు(ఏనః)దుష్టకర్మ లను (అస్మత్) యోగానుష్ఠానమొనర్చు మా నుండి (యుయోధి) దూరమొనర్చుము.

**భావార్థము:-** ఏ పురుషుడు పరమాత్మయొక్క ప్రియమైన భక్తి లేనిదే యోగ సిద్ధిని పొందజాలడు. మరియు నెవడు ప్రేమతో భక్తియుక్తుడై యోగబలముతో పరమేశ్వరుని ధ్యానించునో యతనికి దయాళువైన యా పరమాత్మ శీఘ్రముగ యోగ సిద్ధిని ప్రధాన మొనర్చుచున్నాడు. [౭౯౮]

౭౯౯. అయమిత్యస్యాంగిరస ఋషిః, ప్రజాపతి ర్దేవతా, భురిగార్షీ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

అథ సంగ్రామే బ్రహ్మోపాసకైః శూరవీరైః కథం యోద్ధవ్య మిత్యుపదిశ్యతే.

పరమేశ్వరోపాసకులైన శూరవీరులు సంగ్రామమున నెటుల యుద్ధమొనరించవలయునను విషయమిందుపదేశించ బడినది.

అ॒యన్నో॑ అ॒గ్ని ర్వరి॑వ స్కృణోత్వ॒యం మృధః॑ పు॒ర ఏ॑తు ప్రభి॒న్దన్।
అ॒యం వాజా॑ఞ్జయతు॒ వాజ॑సాతావ॒యం శత్రూ॑ఞ్జయతు॒ జర్హృ॑షాణః॒ స్వాహా॑॥

అ॒యమ్, నః॒, అ॒గ్నిః, వరి॑వః, కృ॒ణో॒తు, అ॒యమ్, మృధః॑, పు॒రః ఏ॒తు॒ ప్ర॒భి॒న్దన్నితి॑ ప్ర+భి॒న్దన్, అ॒యమ్, వాజా॑న్, జ॒య॒తు॒, వాజ॑సాతా॒వితి॒ వాజ+సా॒తౌ, అ॒యమ్, శత్రూ॑న్, జ॒య॒తు॒, జర్హృ॑షాణః. స్వాహా॑. ౭.౪౪॥

పదార్థః:-(అయమ్)సర్వాభిరక్షకః(నః)అస్మాకమ్ (అగ్నిః) వైద్యవిద్యాప్రకాశకః సర్వరోగ నివారకః సద్వైద్యః(వరివః)సుఖకారకం సేవనమ్ (కృణోతు) కరోతు (అయమ్) ముఖ్యయోద్ధా

(మృధః)సంగ్రామాత్(పురః)పురస్తాత్(ఏతు)గచ్ఛతు(ప్రభిందన్) విదారయన్ (అయమ్)వక్తృత్వే నోపదేష్టుం కుశలో యోద్ధా(వాజాన్)వేగాదిగుణయుక్తాన్ స్వసేనాస్థాన్ వీరాన్ (జయతు) ఉత్కర్షతు(వాజసాతౌ)వాజానాం సంగ్రామాణాం సంవిభాగే(అయమ్)సర్వోత్కృష్టః(శత్రూన్)ధర్మశాతకాన్(జయతు)స్వోత్కర్షాయ తిరస్కరోతు. (జర్హృషాణః) భృశమాహ్లాదితః, (స్వాహా) వైద్యకయుద్ధవిద్యయా శిక్షితయా వాచా స్వాహేతి వాఙ్నామసు పఠితమ్. నిఘం ౧.౧౧. అయం మంత్రః శత. ౪.౩.౧-౧౩. వ్యాఖ్యాతః.

అన్వయః :- అయమగ్నిః స్వాహా వాజసాతౌ నో వరివస్కృణోతు. అయం ప్రభిందన్ మృధః పుర ఏతు. అయం వాజా ఞ్జయతు. అయం జర్హృషాణః సన్ శత్రూన్ జయతు.

భావార్థః :- యదా యుద్ధకర్మణి చత్వారో వీరా అవశ్యమేవ భవేయుస్తేష్వేకో వైద్యకక్రియాకుశలః సర్వరక్షకః, ద్వితీయో హి శౌర్యాదిగుణప్రదేన వ్యాఖ్యానేన హర్షయితా, తృతీయః శత్రూణాం తిరస్కర్తా. చతుర్థః శత్రువిఘాతుకః స్యాత్.తదా సర్వా యుద్ధక్రియా ప్రశస్తా భవేత్.

పదార్థము :-(అయమ్)ఈ ప్రథముడు (అగ్నిః) వైద్యవిద్యను ప్రకాశింపజేయు వైద్యుడు (స్వాహా) వైద్యముచేతను, యుద్ధపు శిక్షాయుక్తవాణిచేతను(వాజసాతౌ) యుద్ధమునందు(నః)మాకు(వరివః)సుఖకారకమగు సేవనము(కృణోతు) చేయునుగాక! (అయమ్) ఈ ద్వితీయుడు, యుద్ధమొనర్చు ముఖ్యమైనవీరుడు(ప్రభిందన్) శత్రువులను విదీర్ణమొనరించుచు (మృధః పురః) సమరాంగణమున ముందు (ఏతు) నడచుగాక! (అయమ్)వీరరసమును కలిగించు నుపదేశమిచ్చు నీ మూడవ జోదు(వాజాన్) అత్యంత వేగాదియుక్తులగు వీరులను (జయతు) ఉత్సాహయుక్తులుగా నొనర్చుచుండును గాక! (అయమ్) ఈ నాల్గవ వీరుడు(జర్హృషాణః) నిరంతరమానంద యుక్తుడై (శత్రూన్)ధర్మ విరోధులగు శత్రువులను (జయతు) జయించు గాక !

భావార్థము :- యుద్ధకర్మమునందు నలుగురు వీరులు తప్పక ఉండవలయును. వారిలో నొకడు వైద్యశాస్త్రక్రియా నిపుణుడై యందఱిని రక్షించు వైద్యుడు, రెండవ వాడు సమస్తవీరులకు హర్షముగొలుపు నుపదేశకుడు, మూడవవాడు శత్రువుల నవ మానపఱచువాడు, నాల్గవవాడు శత్రువుల నిర్మూలనమొనరించువాడు. వీరందరున్న ప్పుడే యుద్ధక్రియలన్నియు ప్రశస్తములగును. [౨౮]

---

౨౯౦. రూపేణేత్యస్యాంగిరస ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృజ్జగతీ ఛ్ఛందః, నిషాదః స్వరః.
అథ సభాత్రయేణ రాజ్యం శాసనీయ మిత్యుపదిశ్యతే.

మూడు సభలచే రాజ్యమును శాసించవలయునని యీ మంత్ర మందుపదేశించ బడెను.

రూపేణ వో రూప మభ్యాగాం తుథో వో విశ్వవేదా వి భజతు। ఋతస్య పథా ప్రేత చంద్రదక్షిణా వి స్వః పశ్య వ్యంతరిక్షం యతస్వ సదస్యైః॥ ౭.౪౫॥

రూపేణ, వః, రూపమ్, అభి, ఆ, అగామ్, తుథః, వః, విశ్వవేదా ఇతి విశ్వ+వేదాః, వి, భజతు, ఋతస్య, పథా, ప్ర, ఇత, చంద్రదక్షిణా ఇతి చంద్ర+దక్షిణాః. వి, స్వరితి స్వః, పశ్య, వి, అంతరిక్షమ్, యతస్వ, సదస్యైః.

పదార్థః :-(రూపేణ)చక్షుర్గ్రాహ్యేణ ప్రియేణ(వః)యుష్మాకమ్(రూపమ్)స్వరూపమ్(అభి) సమ్ముఖే(ఆ)సమంతాత్ (అగామ్) (తుథః) జ్ఞానవృద్ధః. అత్ర తు గతి వృద్ధి హింసా స్విత్యస్మా దౌణాదికః స్థక్ ప్రత్యయః(వః)యుష్మాన్(విశ్వవేదాః)యః పరమాత్మా విశ్వం సర్వం వేత్తి తద్వ ద్వర్తమానః(వి)(భజతు)విభాగం కరోతు(ఋతస్య)సత్యస్య(పథా) మార్గేణ(ప్ర) (ఇత) ప్రాప్నుత (చంద్ర దక్షిణాః)చంద్రం సువర్ణం దక్షిణా దానం యేషాం తే.చంద్రమితి హిరణ్యానామసు పఠితమ్. నిఘం.౧.౨. (వి)(స్వః)ఉపతపన్నాదిత్య ఇవ స్వరాదిత్యో భవతి.నిరు.౨.౪౧. (పశ్య)ప్రచక్ష్వ(వి) వివిధార్థే (అంతరిక్షమ్) క్షయరహితమంతర్యామి స్వాభావికం బ్రహ్మవిజ్ఞానం వా (అంతరిక్షమ్) కస్మాదంతరా క్షాంతం భవత్యంతరేమే ఇతి వా శరీరేష్వంతరక్షయమితి వా నిరు.౨.౧౦.(యతస్వ) ప్రయత్నం కురు(సదస్యైః)సదసి భవైః సభ్యై ర్జనైః సహ. అయం మంత్రః శత. ౪. ౩. ౧. ౧౪-౧౫. వ్యాఖ్యాతః.

అన్వయః:-హే సేనా ప్రజాజనా యథాఽహం రూపేణ వో యుష్మాకం రూప మభ్యాగామ్. తథా విశ్వవేదా వో యుష్మాన్ విభజతు తుథ స్త్వం స్వరివ ర్తస్య పథాంతరిక్షం విపశ్య సభాయాం సదస్యైః సహ ర్తస్య పథా ప్రయతస్వ. చంద్రదక్షిణా యూయమృతస్య ధర్మ్యం మార్గం వీత.

భావార్థః :- సభాపతీ రాజా స్వాత్మజానివ ప్రజాసేనా సభ్యపురుషాన్ ప్రీణయేత్, తథా పక్ష పాతరహితః పరమేశ్వర ఇవ సతతం న్యాయం కుర్యాత్. ధార్మికాణాం సభ్యానాం జనానాం తిస్రః సభా భవేయుః.తాస్వేకా రాజసభా యయా రాజకార్యాణి నిష్పద్యేరన్,సర్వే విఘ్నా నివర్తేరంశ్చ, ద్వితీయా విద్యాసభా యయా విద్యాప్రచారః స్యాదవిద్యా నశ్యేత, తృతీయా ధర్మసభా యయా ధర్మో న్నతి రధర్మహానిశ్చ సతతం భవేత్. సర్వే స్వాత్మానం పరమాత్మానం సమీక్ష్యాన్యాయమార్గాత్ పృథగ్భూత్వా ధర్మం సేవిత్వా సమయం పర్యాలోచ్య సత్యాసత్యనిర్ణయే ప్రయతేరన్.

పదార్థము :- ఓ సేనా! ప్రజాసమూహమా! ఎటుల నేను(రూపేణ)దృష్టిగోచర మగు నాయాకారముతో (వః) మీయొక్క (రూపం) స్వరూపమును (అభి ఆ అగామ్) పొందుచున్నానో అటులనే (విశ్వవేదాః) అందరిని నెరుగు పరమాత్మవలె సభాపతి (వః)మిమ్ములను(విభజతు)వేరువేరుగ మీ మీయధికారములందు నియమించుగాక!ఓసభా పతీ!(తుథః)అందరికంటె నధికజ్ఞానవంతుడవు ప్రతిష్ఠితుడవునగు నీవు(స్వః)ప్రతాపమును పొందిన సూర్యునివలె(ఋతస్య) సత్యముయొక్క(పథా)మార్గమున(అంతరిక్షమ్)అవినాశి యగు రాజనీతిని, బ్రహ్మవిజ్ఞానమును (వి)అనేక విధముల(పశ్య)దర్శించుము. మఱియు సభామధ్యమ సదస్యైః)సభాసదులతోపాటు సత్యమార్గమున (ప్ర యతస్వ)విశేషము

ఏ ప్రయోజనము కొఱకు దాన ప్రతిగ్రహణము లొనర్చవలయునను
విషయ మిందుపదేశించ బడెను.

అగ్నయే త్వా మహ్యం వరుణో దదాతు సోఽమృతత్వ మశీయాయు ర్దాత్ర ఏధిమయో మహ్యమ్ ప్రతిగ్రహీత్రే। రుద్రాయ త్వా మహ్యం వరుణో దదాతు సోఽమృతత్వ మశీయ ప్రాణో దాత్రఽఏధి వయో మహ్యామ్ ప్రతిగ్రహీత్రే।బృహస్పతయే త్వా మహ్యం వరుణో దదాతు సోఽమృతత్వమశీయ త్వగ్దాత్ర ఏధి మయో మహ్యామ్। ప్రతిగ్రహీత్రే। యమాయ త్వా మహ్యం వరుణో దదాతు సోఽమృతత్వమశీయ హయో దాత్ర ఏధి మయో మహ్యామ్ ప్రతిగ్రహీత్రే॥ ౭.౪౭॥

అగ్నయే, త్వా, మహ్యామ్, వరుణః, దదాతు, సః, అమృతత్వ మిత్యమృత+త్వమ్, అశీయ, ఆయుః, దాత్రే, ఏధి, మయః, మహ్యామ్,ప్రతిగ్రహీత్ర+ఇతి ప్రతిగ్రహీత్రే, రుద్రాయ, త్వా, మహ్యామ్, వరుణః, దదాతు, సః,అమృతత్వ మిత్యమృత+త్వమ్, అశీయ, ప్రాణః, దాత్రే,ఏధి,వయః,మహ్యామ్,ప్రతిగ్రహీత్ర ఇతి ప్రతిగ్రహీత్రే, బృహస్పతయే, త్వా, మహ్యామ్, వరుణః, దదాతు, సః,అమృతత్వ మిత్యమృత+త్వమ్, అశీయ, త్వక్, దాత్రే, ఏధి, వయః, మహ్యామ్, ప్రతిగ్రహీత్ర ఇతి ప్రతి+గ్రహీత్రే, యమాయ, త్వా, మహ్యామ్, వరుణః, దదాతు, సః, అమృతత్వ మిత్యమృత+త్వమ్, అశీయ, హయః, దాత్రే, ఏధి, వయః, మహ్యామ్, ప్రతిగ్రహీత్ర ఇతి ప్రతిగ్రహీత్రే.

పదార్థః :-(అగ్నయే)చతుర్వింశతి వర్షపర్యంతం బ్రహ్మచర్యం సంసేవ్యాగ్నివ త్తేజస్వీభవాయ(త్వా)వసుసంజ్ఞక మధ్యాపకమ్(మహ్యామ్)(వరుణః)వరః సర్వోత్తమః ప్రశస్తవిద్యోఽనూచానో విద్వానధ్యాపకః(దదాతు)(సః)విద్యార్థీ(అమృతత్వమ్)క్రియాసిద్ధం నిత్యం విజ్ఞానమ్(అశీయ)ప్రాప్నుయామ్(ఆయుః)అధికం జీవనమ్(దాత్రే)విద్యాదానశీలాయ వరుణాయ(ఏధి)వర్ధయితా భవ (మయః) సుఖమ్. మయ ఇతి సుఖనామసు పఠితమ్. నిఘం. ౩.౬. (మహ్యామ్)విద్యార్థినే (ప్రతిగ్రహీత్రే) ప్రతిగ్రహకర్త్రే స్వస్తు. (రుద్రాయ)చతుశ్చత్వారింశద్వర్షపర్యంతం బ్రహ్మచర్యం సుసేవ్య రుద్రగుణధారణాయ(త్వా)రుద్రాఖ్యమధ్యాపకమ్(మహ్యామ్)విద్యార్జన తత్పరాయ (వరుణః) వరగుణప్రదః(దదాతు)సః(అమృతత్వమ్)(అశీయ)(ప్రాణః)యోగసిద్ధబలయుక్తః (దాత్రే) (ఏధి) వర్ధయ (వయః)

అవస్థాత్రయే సుఖభోగం జీవనమ్(మహ్యామ్)విద్యాగ్రహణప్రవృత్తాయ(ప్రతిగ్రహీత్రే)అధ్యాపకాదాగతాయా విద్యాయాః సంచేత్రే(బృహస్పతయే) అష్టచత్వారింశద్వర్షపర్యంతం బ్రహ్మచర్యం సేవిత్వా బృహత్యా వేదవిద్యావాచః పాలకాయ(త్వా) పూర్ణవిద్యాధ్యాపయితారమ్ (మహ్యామ్) పూర్ణవిద్యామభీప్సవే(వరుణః)(దదాతు)(సః)(అమృతత్వమ్)(అశీయ)(త్వక్) స్పర్శేంద్రియసుఖమ్ (దాత్రే) ఏధి (మయః)సుఖవిశేషమ్(మహ్యామ్)(ప్రతిగ్రహీత్రే)(యమాయ)గృహాశ్రమజన్య విషయసేవనాదుపరతాయ యమనియమాదియుక్తాయ(త్వా)సర్వదోషరహితముపదేశకమ్(మహ్యామ్)సత్యాసత్యయోర్నిశ్చయకరణశీలాయ(వరుణః)సత్యోపదేష్టా(దదాతు)(సః)(అమృతత్వమ్)(అశీయ)(హయః) జ్ఞానవర్ధనమ్. హి గతి వృద్ధ్యో రిత్యస్మా దౌణాదికోఽసున్ ప్రత్యయః(దాత్రే) ఏధి)(వయః)చిరజీవనసుఖమ్(మహ్యామ్)సర్వవృద్ధిం చికీర్షవే(ప్రతిగ్రహీత్రే)అయమ్మంత్రః శత. ౪.౩ ౧.౨౮-౩౧.వ్యా.

అన్వయః :- హే వసుసంజ్ఞకాధ్యాపక! యస్మా అగ్నయే మహ్యం త్వా వరుణో దదాతు. సోఽహం యదమృతత్వమశీయ ప్రాప్నుయాం తత్తస్మై దాత్రే వరుణాయాయుశ్చిరజీవన మేధి.ప్రతిగ్రహీత్రే మహ్యం శిష్యాయ మయః సుఖం చ. హే రుద్రసంజ్ఞకాధ్యాపక యస్మై రుద్రాయ మహ్యం త్వా వరుణో దదాతు.సోఽహం యదమృతత్వ మశీయ. తత్తస్మై దాత్రే వరుణాయ ప్రాణస్త్వమేధి ప్రతిగ్రహీత్రే మహ్యం వయో ఽవస్థాత్రయసుఖం చ. హే ఆదిత్యనామాధ్యాపక యస్మై బృహస్పతయే మహ్యం త్వా వరుణో దదాతు. సోఽహం యదమృతత్వమశీయ తత్తస్మై దాత్రే వరుణాయ త్వగింద్రియసుఖత్వమేధి ప్రతిగ్రహీత్రే మహ్యం సుఖం చ యస్మై జితేంద్రియ యమాయ మహ్యం త్వా వరుణో దదాతు.సోఽహం యదమృతత్వమశీయ తత్తస్మై దాత్రే వరుణాయ హయో జ్ఞానవర్ధనం త్వమేధి.ప్రతిగ్రహీత్రే మహ్యం వయోఽవస్థాత్రయసుఖం చ.

భావార్థః :- సర్వేషాం జనానాం యోగ్యమస్తి యః సర్వోత్కృష్టోఽనూచానో విద్వాన్ భవేత్తస్య సకాశాదితరానధ్యాపకాన్ పరీక్ష్య స్వ స్వకన్యాః పుత్రాన్ తత్తత్సదృశాదధ్యాపకాత్పారయేయుః. అధ్యేతారశ్చ స్వ స్వబుద్ధిం న్యూనాధికాం జ్ఞాత్వా స్వస్వసదృశానధ్యాపకాన్ ప్రీత్యా సేవమానాస్తేభ్యో నైరంతర్యేణ విద్యాగ్రహణం కుర్యుః.

పదార్థము :- ఓ వసుసంజ్ఞకాధ్యాపకా! (అగ్నయే మహ్యామ్) చతుర్వింశతి వర్షపర్యంతము బ్రహ్మచర్యమును సేవించి అగ్నివలె తేజస్విని యగు నాకు.(త్వా)అధ్యాపకుని గానిన్ను (వరుణః)సర్వోత్తమ విద్వాంసుడు(దదాతు)ఇచ్చునుగాక!(స)అట్టి నేను (అమృతత్వమ్)స్వకీయ శుద్ధకర్మలచే సాధించబడిన సత్యమైన యానందమును(అశీయ)పొందుదునుగాక! (దాత్రే) ఆ దానశీల విద్వాంసునికి (ఆయుః) దీర్ఘజీవనమును (ఏధి) వర్ధింపజేయుము. (ప్రతిగ్రహీత్రే) విద్యాగ్రహణమొనర్చు (మహ్యామ్) విద్యార్థియగు నాకు (మయః) సుఖము పెంపొందించుము.

దుష్టులనేడ్పించు నో యధ్యాపకా!(రుద్రాయ)నలుబది నాలుగు వర్షముల పర్యంతము బ్రహ్మచర్యాశ్రమమునందుండి రుద్రుని గుణముల ధరించ నిచ్ఛగల (మహ్యామ్) నాకు(త్వా)రుద్రనామక అధ్యాపకుడవైన నిన్ను(వరుణః)అత్యుత్తమ గుణయుక్తుడైన [విద్వాంసుడు](దదాతు)ఇచ్చునుగాక!(సః)అట్టి నేను (అమృతత్వమ్) ముక్తిసాధనముల

ను (అశీయ) పొందుదును గాక! (దాత్రే) విద్యనొసగు విద్వాంసునికై (ప్రాణః) యోగ విద్యాబలము (ఏధి) లభింపజేయుము. (ప్రతిగ్రహీత్రే) విద్యాగ్రహణమొనర్చు (మహ్యామ్) నాకొఱకు (వయః) అవస్థాత్రయసుఖమును లభింపజేయుము.

సూర్యునివలె తేజస్వియగు నో యధ్యాపకా! (బృహస్పతయే) 48 సంవత్సరముల వరకు బ్రహ్మచర్యమును సేవించ నిచ్ఛగల (మహ్యామ్) నాకు (త్వా) పూర్ణవిద్యను గలవు నిన్ను (వరుణః) పూర్ణవిద్యచే శారీరకాత్మబలయుక్తుడగు విద్వాంసుడు (దదాతు) ఇచ్చు గాక! (సః) అట్టినేను (అమృతత్వమ్) విద్యానందమును (అశీయ) భోగించెదనుగాక! (దాత్రే) పూర్ణవిద్యను గలవు ఆ మహా విద్వాంసునికి (త్వక్) శీతోష్ణములస్పర్శ సుఖమును (ఏధి) వృద్ధిపఱచుము. (ప్రతిగ్రహీత్రే మహ్యామ్) పూర్ణవిద్యను గ్రహించు శిష్యుడనగు నాకొఱకు (మయః) పూర్ణవిద్యాసుఖమును ఉన్నతపఱచుము.

గృహాశ్రమముచే లభించు విషయ సుఖములనుండి విముఖుడవు, విరక్తుడవు, సత్యోపదేష్టవునగు నో ఆప్తవిద్వాంసుడా! (యమాయ) గృహాశ్రమ సుఖముయొక్క అనురాగము గలిగి [జితేంద్రియుడనగు] (మహ్యామ్) నాకు (త్వా) సర్వదోషరహితుడవు, ఉపదేశమొసగువాడవు నగు నిన్ను (వరుణః) సకల శుభగుణయుక్తుడగు విద్వాంసుడు (దదాతు) ఇచ్చును గాక! (సః) అట్టి నేను (అమృతత్వమ్) ముక్తిసుఖమును (అశీయ) పొందుదునుగాక! (దాత్రే) బ్రహ్మవిద్యనొసగు ఆమహా విద్వాంసునికి (హయః) బ్రహ్మ జ్ఞానమును (ఏధి) వృద్ధిపఱచుము. (ప్రతిగ్రహీత్రే) (మహ్యామ్) పూర్ణవిద్య గ్రహించు నాకొఱకు (వయః) అవస్థాత్రయసుఖమును లభింప జేయుము.

భావార్థము :- సర్వోత్తమగుణ యుక్తుడు, సకల విద్యలయందు నందరికంటె మించిన విద్వాంసుడునగు [పండితు] ని యాశ్రయమున అన్యాధ్యాపక విద్వాం సులను పరీక్షయొనరించి, తమతమ కన్యలను పుత్రులను ఆయా యోగ్యతలుగల యధ్యా పక విద్వాంసులద్వారా చదివించవలయును. చదువువారును తమతమ ఎక్కువ తక్కువ బుద్ధులను గ్రహించినవారై వారికనుకూలురగు నధ్యాపకులను ప్రీతిపూర్వకముగ సేవించుచు వారినుండి నిరంతరము విద్యను గ్రహించుచునుండవలయును. [౪౭]

---

౪౮. కోఽదాదిత్యస్యాంగిరస ఋషిః, ఆత్మా దేవతా, ఆర్ష్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

**అథేశ్వరో జీవానుపదిశతి.**

ఈ మంత్రమందు పరమాత్మ జీవుల కుపదేశించు చున్నాడు.

కోఽదాత్ కస్మా ఽఅదాత్ కామోఽదాత్ కామాయాదాత్।

కామో దాతా కామః ప్రతిగ్రహీతా కామైత త్తే॥ ౭.౪౮॥

కః, అదాత్, కస్మై, అదాత్, కామః, అదాత్, కామాయ,అదాత్,కామః, దాతా, కామః, ప్రతిగ్రహీతేతి ప్రతిగ్రహీతా, కామ, ఏతత్, తే.

పదార్థః :-(కః)(అదాత్)కర్మఫలాని ఏదాతి.(కస్మై)(అదాత్)(కామః)కామయతే యః పరమేశ్వరః(అదాత్)దదాతి(కామాయ) కామయమానాయ జీవాయ. (అదాత్) దదాతి. (కామః) యః కామ్యతే సర్వై ర్యోగిభిః స పరమేశ్వరః(దాతా)సర్వపదార్థప్రదాయకః(కామః)జీవః(ప్రతిగ్రహీతా)(కామ)కామయతే అసౌ తత్సంబుద్ధౌ(ఏతత్)ఆజ్ఞాపనమ్(తే)త్వదర్థమ్. అయమ్మంత్రః. శ. ౪,౩. ౧. ౩౨. వ్యాఖ్యాతః.

అన్వయః :- కోఽదాత్ ? కస్మాఅదాత్ ? కామోఽదాత్. కామాయాదాత్. కామో దాతా. కామః ప్రతిగ్రహీతా. హే కామ! జీవ! తే త్వదర్థమేతత్ సర్వం మయాజ్ఞప్తమితి.త్వం నిశ్చినుహి.

భావార్థః :- అస్మిన్ జగతి కర్మకర్తారో జీవాః, ఫలప్రదాతేశ్వరోఽస్తీతి విజ్ఞేయమ్. నహి కామనయా వినా కేనచిత్ చక్షుషో నిమేషోన్మేషనం కర్తుం శక్యతే. తత్సర్వై ర్మనుష్యై ర్విచారేణ ధర్మస్యైవ కామనా కార్యా. నేతరస్య చేతీశ్వరాజ్ఞాస్తి.

అత్రాహ మనుః :- కామాత్మతా న ప్రశస్తా న చైవేహాస్త్యకామతా।
కామ్యో హి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః॥
అకామస్య క్రియా కాచిద్ దృశ్యతే నేహ కర్హిచిత్।
యద్యద్ధి కురుతే కించిత్తత్కామస్య చేష్టితమ్॥

పదార్థము :-(కః)ఎవడు కర్మఫలమును (అదాత్) ఒసగును? మఱియు (కస్మై) ఎవనికి (అదాత్) ఇచ్చుచున్నాడు ?

ఈ రెండుప్రశ్నలకు సమాధానము:- (కామః) సర్వులు కామించు నా పరమేశ్వరుడు (అదాత్) ఇచ్చుచున్నాడు. (కామాయ) కామించు జీవమునకు (అదాత్) ఇచ్చుచున్నాడు.

ఇప్పుడు వివేచన మొనర్చబడుచున్నది. (కామః) యోగి జనులు కామించునట్టి యా పరమేశ్వరుడు (దాతా) ఇచ్చువాడు. (కామః) కామన మొనర్చు జీవము (ప్రతిగ్రహీతా) తీసుకొనునది.

(కామ) ఓ కామించు జీవమా! (తే) నీకై నేను వేదములద్వారా (ఏతత్) ఈ సమస్తాజ్ఞను నొసగియున్నానని నీవు నిశ్చయముగ నెఱుగుము.

భావార్థము :- ఈ సంసారమున కర్మనాచరించునది జీవమును, ఫలమొసగువాడు పరమాత్మయు నైయున్నాడు. కామన లేకుండ ఎవడు కనురెప్పయు వేయజాలడు. కావున జీవము కామించవలయును కాని ధర్మ సంబంధముగనే కామించవలయును. అధర్మయుక్తముగ కామించగూడదని యీ విషయమున గ్రహించవలయును.

ఈ విషయమున మనువు చెప్పియున్న దంతయు వేదానుకూలమని నిశ్చయముగ గ్రహించవలయును. అటులనే ఈ సంసారములో అతిగా కామించుటయు ప్రశంస

నీయము కాదు. కామన లేకుండగ నే కార్యమును సిద్ధించదు. కావున ధర్మమును కామించవలయునేగాని, అధర్మమును కామించ గూడదు పలయన వేదములను చదువుట, చదివించుట, వేదోక్తధర్మమును నాచరించుట మొదలైనవి కామనలేనిదే యెన్నటికి సిద్ధించ జాలవు.

ఈ లోకమున మూడుకాలములందును ఇచ్ఛలేని క్రియ యేదియు గన్పించదు. చేయబడునదంతయు నిచ్ఛయొక్క వ్యాపారమే. కావున శ్రేష్ఠ వేదోక్తకామనల నభిలషించవలయునేగాని ఇతర దుష్టకర్మల కోరగూడదు. [౨౯౩]

అస్మిన్నధ్యాయే—(౧)బాహ్యాభ్యంతర వ్యవహారః,(౨)మనుష్యాణాం పరస్పరం వర్తనమ్, (౩)ఆత్మకర్మ,(౪)ఆత్మని మనసః ప్రవర్తనం,(౫)ప్రథమకల్పాయ యోగిన ఈశ్వరోపదేశః,(౬) జిజ్ఞాసుం ప్రతి, చ యోగి కృత్యం,(౭)తల్లక్షణం,(౮)అధ్యాపక శిష్యకర్మ, (౯)యోగవిద్యాభ్యాసినాం కృత్యం,(౧౦)యోగేనాంతఃకరణ శోధనం,(౧౧) యోగాభ్యాసి లక్షణం, (౧౨) శిష్యాధ్యాపక వ్యవహారః,(౧౩)స్వామి సేవక కృత్యం,(౧౪)న్యాయాధీశేన ప్రజారక్షణప్రకారః,(౧౫)రాజసభ్యజన కృత్యం,(౧౬)రాజ్ఞోపదేశ కరణం,(౧౭) రాజభిః కార్యం,(౧౮)పరీక్ష్య సేనాపతి కరణం,(౧౯) పూర్ణవిద్యస్య సభాపతిత్వాధికారః,(౨౦)విద్వత్కృత్యం,(౨౧)ఈశ్వరోపాసకోపదేశః,(౨౨)యజ్ఞానుష్ఠాతు ర్విషయః,(౨౩)ప్రజాదీన్ ప్రతి సభాపతేర్వర్తనం,(౨౪)రాజప్రజాజన సత్కారః, (౨౫) అధ్యాపకాధ్యేతౄణాం పరస్పరం ప్రవృత్తిః, (౨౬)ప్రతిదినం పఠనవిషయో, (౨౭) విద్యావృద్ధి కరణం.(౨౮)రాజ్ఞః కర్తవ్యం కర్మ,(౨౯)సేనాపతి కృత్యం,(౩౦)సభాధ్యక్షక్రియా,(౩౧)ఈశ్వర గుణ వర్ణనం,(౩౨)తత్ప్రార్థనా,(౩౩)శూర వీరై ర్యుద్ధానుష్ఠానం,(౩౪)సేనాస్థ పురుష కృత్యం,(౩౫) బ్రహ్మచర్య సేవనప్రకారః,(౩౬)ఈశ్వరస్య జీవాన్ ప్రత్యుపదేశశ్చ ఉక్తః.*

అత ఏత దధ్యాయార్థస్యోక్తషష్ఠాధ్యాయార్థేన సహ సంగతి రస్తీతిబోధ్యమ్.

ఇతి శ్రీ మత్పరమ విదుషాం శ్రీ విరజానంద సరస్వతీ స్వామినాం శిష్యేణ పరివ్రాజకాచార్యేణ
శ్రీయుత పరమవిదుషా దయానంద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్య భాషాభ్యాం
విభూషితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే
సప్తమోఽధ్యాయః పూర్తిమగాత్.



కృష్ణామండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు
పాలడుగు శేషాచలాచార్య, తదేవ మండలాంతర్గత ముదునూరు
గ్రామవాస్తవ్యుడు అన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన
శ్రీమద్దయానంద సరస్వతీ నిర్మిత యజుర్వేద భాషాభాష్యమందలి సప్తమాధ్యాయము సమాప్తము.

---

* దీని యాంధ్రానువాదము విషయసూచిక పేరుతో అధ్యాయారంభమున నిచ్చితిమి. ఇందలి సంఖ్యలు మాచే నిర్దేశించబడినవి.

[కేశవార్యశాస్త్రి.]

నాగేంద్ర ప్రింటింగ్ ప్రెస్, మహంకాళీ స్ట్రీట్, సికింద్రాబాదు.